సాహిత్య
ప్రస్థానం
జూన్ 2015

సంపుటి : 14 సంచిక : 6

## చదువుల సంత

వేసవి సెలవులు ముగిసి విద్యాలయాలు తెరుచుకునే సమయం. రెండు తెలుగు రాష్ట్రాలలోను వివాదాలు అధిగమించి ఎంసెట్ ఎంట్రన్స్‌లు సజావుగా ముగిసాయి. అయితే ప్రైవేటు సీట్ల ఫీజులను విపరీతంగా పెంచడం తల్లితండ్రులకు పెను భారమే. తల్లితండ్రులు తలకు మించిన భారం అయినా తమ పిల్లల చదువులకు ఖర్చు పెట్టడానికి వెనుకాడడం లేదు. అయితే అందుకు తగిన విధంగా ఈ చదువులు సాగుతున్నాయా అంటే సమాధానం చెప్పడం కష్టం. పిల్లల ఆసక్తి, విషయ పరిజ్ఞానం వంటి అంశలతో సంబంధం లేకుండా ఏ రంగంలో వేతనాలు ఎక్కువగా ఉన్నాయనేది విద్యార్థుల చదువుకు ప్రాతిపదికగా మారడం విపరీతం. చదువులలో ఐటి రంగమే సర్వస్వమన్నట్లు, సామాజిక శాస్త్రాలు, చరిత్ర వంటి వాటికి ప్రాధాన్యత కల్పించకపోవడం వంటి వాటివల్ల సామాజిక సమతుల్యత దెబ్బతినడమే కాకుండా, సమాజం సమగ్ర వికాసం వైపుగా సాగడానికి ఆటంకాలు ఏర్పడతాయి. అరకొర వసతులతో ఇంజనీరింగ్ కాలేజీలను ఏర్పాటుచేయడం వల్ల ఏర్పడిన అనర్థాలు ఇప్పుడు మనం చూస్తున్నాం. ఇంజనీరింగ్ చేసిన విద్యార్థులు ఉద్యోగాలు లేక తీవ్ర వేదనకు గురవుతున్నారు. క్యాంపస్ నియామకాలు చాలా పరిమితంగా జరుగుతున్నాయి. పెద్ద సంఖ్యలో నిరుద్యోగులు నిరాశా నిస్పృహల్లో కొట్టుమిట్టాడుతున్నారు. ఈ పరిస్థితిని మార్చాలి. యువతకు సరైన దిశానిర్దేశం చేయకపోతే సమాజం మీద ప్రభావం తీవ్రంగా ఉంటుంది. అది అనేక దుష్పరిణామాలకు దారితీస్తుంది. ముఖ్యంగా విద్యావ్యవస్థను సమగ్రమైన అవగాహనతో రూపొందించుకోవాలి. విద్యార్థికి చదువు ఆత్మవిశ్వాసం అందించాలి. కాలేజి నుండి బయటకు వచ్చిన విద్యార్థి సమాజ నిర్మాణానికి తన వంతు తోడ్పడేలా ఉండాలి. నిరుత్సాహ వాతావరణం ఎదురుకాకూడదు. ప్రస్తుతం మార్కెట్ వ్యవస్థ ప్రపంచీకరణ పేరుతో సమాజాన్ని శాసిస్తున్నది. ప్రైవేటీకరణ పేరుతో లాభాలే పరమావధిగా సాగే మార్కెట్ ఆర్థిక వ్యవస్థ సామాజికాంశాలను పట్టించుకోదు. వ్యాపార విధానాలే ఒక మంచి సమాజాన్ని నిర్మించలేవు. పైగా మానవ విలువలను విధ్వంసం చేస్తాయి. ఈ పరిస్థితులకు వ్యతిరేకంగా రచయితలు తీవ్రంగా స్పందించాల్సిన పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా మానవ సంస్కారాన్ని పెంచే సాహిత్యాన్ని సృష్టించాలి. యువతలో సామాజిక స్ఫూర్తిని పెంచే, ఉత్తేజం కలిగించే రచనలు చేయాలి. అప్పుడే యువత ఇటువంటి నిరుత్సాహ వాతావరణాన్ని ఎదుర్కొని నిలబడగలుగుతారు.

బొమ్మలు : తుంబలి శివాజి, జె.వెంకటేష్, భాస్కర్

## ఈ సంచికలో ...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్
ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర,
హైదరాబాద్ - 500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

## శ్రవణ కుతూహలం

- డా॥ సి. నారాయణ రెడ్డి



ఎన్నాళ్లుగానో
ఏవేవో మాటలు వినిపిస్తూనే వున్నాయి.
వాటిని స్వీకరించే చెవులు
తమ తలుపులు మూసుకునే ఉన్నాయి.
గీపెట్టినా వినిపించుకోని
కరుడుగట్టిన చెవులు అవి.
ఆ చెవులకు చెవుడేమో?
నా గొంతును వాటికి దగ్గరగా వుంచి
స్వరస్థాయిని పెంచి
ఇప్పుడైనా వినిపిస్తున్నదా అని
ప్రశ్నించాను.
పరిపూర్ణ మౌనమే
ప్రత్యుత్తర రూపంలో వెలువడింది.
ఎటూ తోచక నేను నిస్పృహతో
'ఉస్' అనే స్వరం రవళించే
సుదీర్ఘనిశ్వాసం విడిచాను.
చెవుల్లో చిరుకదలిక మొదలైంది
స్వరబద్ధంగా సాగిన నిట్టూర్పునే
ఈలగా మలచుకుని వినిపించాను.
ఉభయ శ్రవణాలు నిక్కపొడుచుకున్నాయి.
శ్రవణాల స్వర కుతూహలం
అంతటితో నాకు అవగతమయింది
ఈలపాటనే వేణుగానంగా మలచుకుని
ఆలాపన కొనసాగించాను.
పరవశించిన చెవులు ఉవ్వెత్తుగా పొంగి
తమ ఆమోదాన్ని తెలియజేసినై.
అప్పుడు నాకు అర్థమయింది
మాటల పట్ల విముఖత
పాటల పట్ల సుముఖత ఉండే
శ్రవణాలూ ఉంటాయని.

## మే నెల పురస్కారాలు



**ఒట్టిపోయిన మంత్రం**
కథకు: రూ.700/-
రచయిత : **చొప్ప వీరభద్రప్ప**

**అర్ధాంగి ???**
కవితకు : రూ .500/-
రచయిత : **నూనెల శ్రీనివాసరావు**



సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

వ్యాసం : **హేతువాద భావాలను వెదజల్లిన విశిష్ట రచయిత తాపీ ధర్మారావు** రచయిత : **సింహాద్రి నాగశిరీష**

ఈ రచయితకు 'కర్లపాలెం రుక్మిణమ్మ స్మారక పురస్కారం రూ.500/- అందజేయబడుతుంది

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# అవాంఛితం

- నందవరం కేశవరెడ్డి
98851 20878



రాత్రి స్ట్రోకొచ్చి ఆత్మారాము చనిపోయాడు. తెల్లారబోతుండగా ఓ టీచర్ ఫోన్ చేసి చెప్పాడు. షాక్‌కు గురయ్యాను. నిన్న జరిగిన జిల్లా విద్యాధికారి విచారణ ప్రభావమా యేమీ, అనుకుంటు, కొక్కికి వేలాడు తున్న షర్టును తగిలించుకుని, ఊరికి ఆ చివరనున్న ఆత్మారాముంటున్న యింటికి బయలుదేరాను.

జిల్లా కేంద్రానికి విసిరేసినట్లు, పక్క జిల్లాకు సరిహద్దుగా ఉన్న ఆ మారుమూల మండల కేంద్రంలో, ప్రభుత్వ పాఠశాల హెచ్ ఎంగా ఆత్మారాము, అదే కాంపౌండ్‌లో ఉన్న ప్రభుత్వ జూనియర్ కళాశాలలో లెక్చరర్‌గా నేను గత మూడు సంవత్సరాలుగా పనిచేస్తున్నాము.

రోజూ సాయంకాలం క్రమం తప్పకుండ వాకింగ్ పోయే అలవాటు నాకుంది. ఆత్మారాముకు కూడా యిదే అలవాటుండంతో అక్కడే ఒకరికొకరం పరిచయమయ్యాం. వీలు పడినప్పుడు కళాశాల కాంపౌండులోను మాట్లాడుకుంటూ ఉండేవాళ్లం. ఒకరి అభిప్రాయాల్ని ఒకరు చెప్పుకోవడం ఒకరి అభిరుచుల్ని ఒకరం పంచుకోవడంతో మా మధ్య స్నేహబంధం ఏర్పడింది. కుటుంబ నేపథ్యాలు ఒకటిగా ఉండడంతో ఆత్మీయ మిత్రులమయ్యాం.

పేద కుటుంబం నుంచి వచ్చి, ప్రభుత్వ వసతి గృహాల్లో ఉంటూ ఆర్థిక యిబ్బందులు పడుతూ కష్టపడి చదువుకుని ఉపాధ్యాయ వృత్తిలోకి వచ్చినవాడు ఆత్మారాము, పాఠశాలలో ఆర్థిక యిబ్బందులు పడుతున్న విద్యార్థులను గమనించి ప్రోత్సహించేవాడు. వృత్తిపట్ల గౌరవంతో బాగా పాఠాలు చెప్తూ సంతోషిస్తూ విద్యార్థులతో కలిసిపోయే ఆత్మారాము అంటే ఇటు విద్యార్థులకు అటు ఊర్లోవారికి గౌరవం. కాని అతి చిన్న విషయానికి చలించి పోవడం, బాధాకరమైన సంఘటనల్ని విన్నప్పుడో, చూసినప్పుడో కంట తడిపెట్టడం చూసి ఆశ్చర్యపోయేవాడిని.

"మనింట్లో నీవన్నా చదువుకో... బాగా చదువుకుంటే నీవు బాగుపడడమే కాదు నీ కుటుంబమూ నీ పిల్లలూ బాగుంటారు - అని వాళ్ల నాయన సెలవుల్లో యింటికి పోయినప్పుడల్లా అంటూ ఉండేవాడని ఆత్మారాము అప్పుడప్పుడు చెప్పుకునేవాడు. తండ్రిపట్ల అతనికున్న ఆరాధనా భావాన్ని మెచ్చుకునేవాడిని.

ఆత్మారాముకు ఇద్దరు బిడ్డలు. వారిని తన స్కూల్లోనే చేర్పించి చదివించుకుంటున్నాడు. పెద్దమ్మాయి తొమ్మిది. చిన్నమ్మాయి యేడు.

పోతూ వుంటే ఒకరిద్దరు టీచర్లు ఎదురుపడ్డారు. వారి ముఖాల్లో విషాదచ్ఛాయలు. తలవంచుకుని ముందుకు అడుగులు వేస్తున్నాను.

ఒకరోజు సాయంకాలం ఊరి బయట నడుస్తున్నాము. ఆకులు రాల్చుకుని చెట్లు చేమలు కొన ఊపిరితో అల్లాడుతున్నాయి

మాటల సందర్భంలో ఆ రోజు ఒక దిన పత్రికలో దిలీప్ రెడ్డి రాసిన బడి చదువులు బతికేదెలా? వ్యాసం మా మధ్య చర్చకు వచ్చింది.

"బట్టీల పుణ్యమా అని దేశవ్యాప్తంగా జరిగే అన్ని పోటీ ప్రవేశ పరీక్షల్లో రికార్డులు సాధించే మన వాళ్ళు అకడమిక్స్‌లో ఉద్యోగాలు పొందడంలో ఉత్తర భారతదేశీయులతో పోటీ పడలేకపోతున్నారు. కారణం సరుకు లేకపోవడమే. పాఠశాల విద్య అనే పునాది బలహీనంగా ఉండటమే. వివిధ అధ్యయనాల ప్రకారం ఇందుకు ప్రధానకారణం టీచరే! అత్యధిక టీచర్లు సమయానికి బడికిరారు. వచ్చినా పాఠాలు చెప్పరు. ఉపాధ్యాయ సంఘాలు బలమైన శక్తిపీఠాలుగా ఉండి ఎగవేతలకు దన్నుగా నిలుస్తాయి." ఇది ఆ వ్యాసంలోని సారాంశం.



వ్యాసకర్త అభిప్రాయాల్తో పూర్తిగా ఏకీభవిస్తూ బడి చదువుల్ని భ్రష్టు పట్టించింది టీచర్లేనని ఆత్మారాముతో గట్టిగా అన్నాను.

ఉన్నత విద్యావంతుడనైన నన్ను అలాంటి అభిప్రాయానికి రాకూడదని, విషయాన్ని, బాగా చూడాలని సూచించాడు. విద్యా వ్యవస్థతోపాటు ప్రభుత్వరంగ సంస్థలన్నీ అంతర్జాతీయ పరిణామాల కారణంగా నిర్వీర్యమవుతున్నాయి. కార్పొరేట్ పెను రక్కసి కోరలు సాచి అన్నింటినీ కబళించి మింగుతోంది. ప్రభుత్వం విద్యారంగాన్ని ప్రైవేటీకరించి తన బాధ్యత నుంచి తప్పుకోచూస్తోంది. అధికారులు అందుకు సహకరించడం శోచనీయం. బడులలో భౌతిక వసతుల్ని పెంచి, టీచర్ల పై నిఘా పెట్టి, నిరంతర శిక్షణలతో వారిని పునరత్తేజపరుస్తు వృత్తిపట్ల అంకితుల్ని చేయవచ్చునని వివరించాడు. ఆ మాటలు విన్నప్పుడు అవునేమో అనిపించింది.

అప్పుడప్పుడు మా మధ్య సాగే యిలాంటి చర్చలు మమ్మల్ని సంస్కరించుకొనడానికి యెంతగానో ఉపయోగపడేవి.

సందుమలుపు తిరిగాను. అక్కడక్కడ ఆత్మారాము మరణాన్ని గురించి మాట్లాడుకునేవాళ్లు ఎక్కువగా కనపడసాగారు. ఆత్మారాముని గురించి ఆలోచిస్తూ నడుస్తున్నాను.

ఆ మండలంలో పనిచేస్తున్న కొందరు విద్యాధికారి ఒత్తిడుల్ని భరించలేక స్వచ్ఛంద పదవీ విరమణ చేయగా, జిల్లా విద్యాధికారి ఆత్మారామును ఇంచార్జి ఎంఇఓగా నియమిస్తూ ఉత్తర్వులిచ్చారు.

ఉత్తర్వునందుకున్న ఆ రోజు సాయంకాలం వాకింగ్ సమయంలో దానిపైన్నే మాటలు సాగాయి.

ప్రస్తుతమున్న పరిస్థితుల్లో ఎంఇఓగా విధులు నిర్వహించడం కత్తి మీద సామే. అదీగాక సున్నిత మనస్సు గల నీలాంటి వాడికి మరీ కష్టమేమో అన్నాను ఆత్మారాముతో.

'నిజమే కాని యేదో కొంత ప్రయత్నించలేనా అని అనుకుంటున్నాను. వృత్తికి మరోవిధంగా సేవ చేసే అవకాశం దక్కింది. సద్వినియోగం చేసుకుంటాను. దిగకుండానే యింత లోతు అంత లోతు అనుకోవడం సబబు కాదేమో' నడుస్తున్న దారివైపు చూపుసారిస్తూ అన్నాడతడు.

స్వరంలో విశ్వాసం పట్టుదల గమనించాను. సమస్యల పట్ల సానుకూల దృక్పథం గల వ్యక్తి అంటే నాకు ప్రత్యేక అభిమానం. ఆత్మారామును మనసులోనే అభినందించాను.

ఆత్మారాముంటున్న యిల్లు దూరంగా కనిపిస్తోంది. బరువుగా అడుగులు పడుతున్నాయి. చావుగాలి వీస్తున్న సవ్వడి.

కొత్త బాధ్యతలతో ఆత్మారాము వాకింగ్ రావడం తగ్గినా వచ్చినప్పుడు తను విజిట్ చేసిన బడులను, టీచర్లను గురించి అన్నీ చెప్పేవాడు. అక్కడి సమస్యల్ని, వాటి పరిష్కార మార్గాల్ని తెలిపేవాడు. ఆసక్తిగా వినేవాడిని.

ఒకరోజు ఆత్మారాము ఒక ప్రాథమిక పాఠశాలకు విజిట్ పోయాడు. తరగతి గదిలో ఒక టీచరున్నాడు. ఉన్నత విద్యావంతుడు ఎలా ఎం.ఎ.పి. హెచ్.డి ఎస్జీటీగా సెలెక్ట్ అయివచ్చాడు. యవ్వనానికి ప్రతినిధిగా షర్ట్ ఇన్ చేసి చాకులా ఉన్నాడు. గ్రూప్‌వన్ ఫలితాలకై యెదురు చూస్తున్నట్లు చెప్పాడు. మాటల్లో గర్వం. తరగతిలో పిల్లల ముఖాలు, ఎండిన చీమిడి ముక్కులతో వారి పేదరికాన్ని పట్టి చూపుతున్నాయి. టీచర్ను అడిగిన ప్రశ్నలకు నిర్లక్ష్యంగా యిచ్చిన జవాబులు ఆత్మారామును నొప్పించాయి. ఒకటి రెండు మాటలు చెప్పి మరో బడికి దారి తీశాడు ఆత్మారాము.

ఆ బడిలో యిద్దరు భార్యభర్తలు టీచర్లు, వారి సొంత ఊరు పక్కన పల్లె. భార్య యెప్పుడో అమాసకో పున్నానికోగాని బడికి రాదు. బాగా ఉండే వ్యవసాయకుటుంబం వారిది. పలుకుబడితో చాలా యేండ్ల నుంచి వాళ్లు అక్కడే ఉంటున్నారు. వారికి ఈ ఉద్యోగాలు అదనపు ఆదాయాన్నిచ్చే గనులు. ఆత్మారాము తరగతి ఐదులో ఒకరిద్దరు పిల్లల్ని పరీక్షించాడు. గణితంలో స్థాన విలువలు తెలియవు. తెలుగులో దోషాలు లేకుండా వాక్యం రాయలేరు. పిల్లలు పనులకు పోతారు. చదవరు అని తప్పు వాళ్లదే అంటాడు టీచర్. దీనికి పరిష్కారం

మేమిటా అని ఆలోచిస్తు మరో బడికి దారి తీశాడు ఆత్మారాము.

ఆ బడి మండల కేంద్రానికి దూరంగా చాలా వెనుకబడిన పల్లెలో ఉంది. అందులో ఉండేది ఒకే టీచర్. ఆ టీచర్ కూడా జిల్లా కేంద్రంలో యింత కంటే యెక్కువ ఆదాయమిచ్చే పనిలో ఉంటున్నాడు. నెలకోసారి వచ్చి కలువవలసిన వాళ్లను కలిసి జీతం తీసుకుని పోతూ ఉంటాడు. అదే పల్లెలో పది తప్పిన పిల్లవాడు ఆ బడిని చూసుకుంటుంటాడు. టీచర్ అంతో యింతో యిస్తుంటాడు.

ఇలాంటి టీచర్లను ఎలా గాడిలో పెట్టాలి? ప్రయత్నిస్తే యెదురయ్యే ప్రతిఘటనలు దాడులు ఎలా ఉంటాయి? ఇవి మా మధ్య చోటుచేసుకునే ప్రశ్నలు. వీటినన్నింటినీ ఒక పద్ధతి ప్రకారం బాగుపరచాలనే సంకల్పంతో ఆత్మారాము ఉన్నప్పుడు, నిన్న జరిగిన విచారణ ఆత్మారామును భరించలేని క్షోభకు బలిచేసింది. మృత్యువొడికి చేర్చింది.

ఇంటి ముందుకొచ్చాను. వచ్చినవారు విగతజీవుడైన ఆత్మారామును చూస్తూపోతున్నారు. నేను మెల్లగా గుంపులో చోటుచేసుకుని మృతదేహం దగ్గర నిల్చుని కొన్ని నిముషాలు మౌనంగా ముఖాన్ని చూస్తు ఉండిపోయాను.

"లే నాన్నా ! లే ! నిద్రలే నాన్నా లే ! చిన్నమ్మాయి అమాయకంగా దేహాన్ని తడుతూ బిగ్గరగా యేడుస్తోంది. పెద్దమ్మాయి పక్కనే భోరున దుఃఖిస్తోంది. ఇంట్లో ఆత్మారాము భార్య భరించలేని బాధతో కూలబడిపోయింది.



వారిని ఓదార్చడం చేతకాలేదు. భరించలేని వేదనతో దూరంగా కుర్చీలో కూర్చున్నాను.

ఈ మరణానికి కారణం, నాతో ఒకసారి ఆత్మారాము ప్రస్తావించిన గుంటిమీదపల్లి సంఘటన కళ్లముందు కదలాడింది. పక్షం రోజుల కిందట పాఠశాలల్లో అర్ధ సంవత్సరం పరీక్షలు జరుగుతున్నాయి. రేపు చివరిపరీక్ష అనగా ఈ రోజు గుంటిపల్లి మీద యుపి స్కూలుకు ఆత్మారాము విజిట్ పోయాడు. తరగతి గదులకున్న తాళాలు అతన్ని యెక్కిరిస్తున్నట్లుగా వేలాడుతున్నాయి. ఆ స్కూలు హెచ్ఎంది అదే ఊరు. అతని భార్యతో పాటు మరో ముగ్గురు పనిచేస్తున్నారు. హెచ్ఎం పిల్లలు జిల్లా కేంద్రంలో ఉంటున్నందున రెండు రోజుల ముందే పరీక్షలన్నీ నిర్వహించి, హెచ్ఎం తన భార్యతో జిల్లా కేంద్రానికిపోతే మిగిలిన టీచర్లు వాళ్ల ఊర్లకు వెళ్లిపోయారు. ఆశ్చర్యంతో దిక్కులు చూస్తున్న ఆత్మారామునకు దూరంగా వస్తున్న విద్యార్థులు కనిపించారు. వాళ్లు చెప్పింది నోట్ చేసుకుని, విద్యార్థులతో, ఊర్లో కొందరు పెద్దలతోను సంతకాలు తీసుకుని ఫైల్ బిల్డప్ చేసి, మూలకారకుడైన హెచ్ఎంను సస్పెండ్ చేస్తూ, మిగిలిన టీచర్లకు సంజాయిషీ పత్రాలను జారీ చేశాడు ఆత్మారాము. ఈ విషయాన్ని జిల్లా విద్యాధికారి కార్యాలయానికి తెలియబరిచాడు. సంక్రాంతి సెలవుల తర్వాత పాఠశాలల్ని ప్రారంభించే సమయానికి గుంటిమీద పల్లి ఉదంతం జిల్లా అంతటా వ్యాపించింది. ఆ పాఠశాల హెచ్ఎం యెంత బతిమాలినా బామాలినా ఆత్మారాము తగ్గలేదు. హెచ్ఎం. అస్త్ర శస్త్రాలన్నింటినీ ప్రయోగించాడు. ఉన్న యూనియన్లు అన్నింటిలోను అతను సభ్యుడు. వాటికి రాజ పోషకుడు. ఆ ప్రాంతంలో చోటా మోటా నాయకులకు కావలసిన వాడు. అందరు ఆత్మారామును ఉక్కిరిబిక్కిరి చేశారు. అయినా ఆత్మారాము తగ్గలేదు. హెచ్ఎం చివరకు ఆత్మాహత్యకు పూనుకున్నట్లు ప్రచారం గూడా జరిగింది. ఆత్మారాము చలించలేదు. చివరిది నిన్న జరిగిన విచారణ ప్రత్యక్షంగా ఉన్న టీచర్ చెప్తే విని రాని నేను చలించిపోయాను. రాష్ట్ర యూనియన్ నాయకుడితో సహా జిల్లా నాయకులు డిఇఒను వెంటబెట్టుకుని వచ్చారు. బడి చదువులను కాపాడుకోవలసిన నాయకులు, వీరావేశంతో అనరాని మాటలంటు ఆత్మారామును క్షోభకు గురి చేశారు. కొందరు అదుపు తప్పి దాడికి కూడా పాల్పడ్డారు. కన్నీటిపర్యాంతమై ఆత్మారాము ఇంటికి వచ్చాడు. తెల్లారగానే శవమైపోయాడు.

కర్ణుడి చావుకు సవాలక్ష కారణాలన్నట్లు బడి చదువులు పాడై పోవడానికి అనేక కారణాలున్నాయి. వాటిని మరీ అంత సీరియస్‌గా తీసుకుంటే మన ఆరోగ్యాలు చెడిపోతాయి. ఇవే మాటలను ఆత్మారాముతో అప్పుడప్పుడు చెప్తూ ఉండేవాడిని. అయినా జరగ కూడనిది జరిగిపోయింది.

లే నాన్నా లే! బిడ్డల యేడుపులు గుండెల్ని పిండేస్తున్నాయి. యేడ్పులతో బొంగురుపోయిన గొంతులు పేగుల్ని మెలిపెడుతున్నాయి.

ఆత్మారాము అంత్యక్రియలు వారి స్వగ్రామంలో నిర్వహించాలని నిర్ణయించడంతో వచ్చిన అంబులెన్సులోకి దేహాన్ని చేర్చారు. అంబులెన్స్ బయలుదేరింది. నాతో పాటు ఆత్మీయులు, టీచర్లు కొంత దూరం అనుసరించారు.

"పచ్చని జీవితాన్ని మట్టిపాలు సేసిరి గదప్పా. ముండాకొడుకులు, వాళ్లకు దుప్పటి గప్పా! వాళ్ల తాడు తెగ" దూరంగా ఒక పెద్దమె శాపనార్థాలు.

వాహనం కనుమరుగయ్యింది. ఆత్మీయ మిత్రులు శాశ్వతంగా దూరమయ్యాడు. బరువైన గుండెలతో యింటిముఖం పట్టాను.

ఔ

# చేతులు

- డా॥ ఎన్. గోపి



చే తులు
వొట్టి తోలు కట్టెలు కావు
అగ్గువగా అమ్ముడౌతున్నంత మాత్రాన
ఎవరికీ గులాంగిరి చెయ్యవు.

రెక్కలు ఆకాశంలో తిరిగిరావొచ్చు
కాని ఈ రెక్కలు మాత్రం
భూగోళాన్ని గిరగిరా తిప్పుతూ
శ్రమ సూర్యుడికి తోడ్పడతాయి.
బేకారుగా కులికే చేతులు
తోకల్లాగ వేలాడుతాయి.
కాని నిజమైన చేతులు
బతుకు తుఫానులో
శరీరం పడవను
తెరచాపల్లా నిలబెడతాయి.
తెడ్లై ముందుకు తోస్తాయి

కొన్ని చేతులను నాటితే
అవి పిడికిళ్లై మొలుస్తాయి
కవాతు చేసే చేతుల ముందు
జనావళులు సముద్రాలై లేస్తాయి.

కత్తి పట్టాలన్నా
కరుణ చూపాలన్నా
చేతులకే సాధ్యం.
కండ్లలోంచి
నదులు ధారలుగా కారుతుంటే
చేతులు ఆనకట్ట వేస్తాయి.
చెయ్యి చెయ్యి కలిపితే
కుటిల మేఘాలు
మెరుపు పగుళ్లతో ముక్కలౌతాయి.

మనసులాంటివే
చేతులు కూడా
దేహం నిద్రపోయినా
చేతులు నిద్రపోవు
ఒక ఆవేశం
ఒక ఆరాటం
ఒక ఉద్వేగం
ఒక పోరాట కెరటం
అన్నీ చేతుల్లోంచే
ప్రత్యక్షమౌతాయి
అహో! చేతుల ముందు
ఈ మహాకావ్యాలెంత!

# పుస్తకాల అల్మయిరా

- సలీం



మేధస్సుని కవ్వంలా చిలికితే
ఒలికిన జ్ఞాన సుధా ధారలు
అక్షరాలు గువ్వలుగా మారి
కాగితాల కొమ్మల మీద కూర్చున్నట్టు
పుస్తకాల అల్మయిరా నిండా
అనంత సంగతుల గుసగుసలు...
బాసింపట్టు వేసుకుని
జ్ఞాన వీణ తంత్రుల్ని మీటుతున్న
బుల్లి బుల్లి సరస్వతులేగా పుస్తకాలంటే
తెల్లటి దేహం మీద
ఒదిగిన ముత్యాల సరాల్లా
కాగితం సిగలో
పొదిగిన వాక్యాల విరులు
కవాతు చేస్తున్న సైనికులు కదా
నిటారుగా నిలబెట్టిన పుస్తకాలు
అజ్ఞాన తిమిరం మీద
అనాదిగా చేస్తున్న సమరం

పుస్తకం హస్త భూషణం మాత్రమేనా
అది మస్తిష్కానికి మధురసం కూడా
e-పుస్తకాల మాయదారి కాలం
కాగితాల్లేని పుస్తకాలు
పరిమళాల్లేని కాగితప్పువ్వులు
కంప్యూటర్ తెరమీద
మౌస్ కదలికలతో దొర్లే పేజీలు..
చదువుతూ చదువుతూ
అలసిపోయి పడుకుంటే
గుండెలమీద పసిపాపలా
సేదదీరే పుస్తకం కదా మనకు ప్రియం

పేజీలు తిప్పడానికి
వేలిని నాలిక మీద తడిచేసి
పేజీ కొసల్ని పట్టుకుని
పక్కకు తిప్పినపుడే కదా
నోటికి కాగితం రుచి తగిలి
నాసిక కాగితం గుబాళింపుకు మత్తిలి
చదవడంలో ఉన్న రుచేమిటో తెలిసేది
అల్మయిరాలో
మణి మాణిక్యాల్లా
పొదగబడిన పుస్తకాల సౌందర్యం
అంతర్జాలంలో
చాటుగా ఒదిగిన
e - పుస్తకాలకెక్కడిదా అందం
కళ్ళప్పగించి చదవటం కన్నా
పుస్తకాన్ని హస్తభూషణం చేసి
చదివినప్పుడే కదా ఆనందం

# ప్రపంచీకరణ - తెలుగు కథ



- డా॥ మండ్ల జయరాం
9440107260

**ప్రపంచీకరణ సాహిత్యమంటే ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యమనీ, తెలుగు రచయితలు ప్రపంచీకరణను ఇప్పటిదాకా వ్యతిరేకించే వాళ్ళేగాని, ఆమోదించిన వాళ్ళు లేరు. ఉన్నా అత్యల్ప సంఖ్యాకులు, మన స్థానికతను, మన మూలాలను, మన వృత్తులను, పంటలను వంగడాలను ఆట పాటలను, మన ప్రకృతిని, మన మానవ సంబంధాలను సారాంశంలో మన జీవితాన్ని ప్రపంచీకరణ ఎలా విధ్వంసం చేస్తున్నదో ఈ కథలు వివరిస్తాయి.**

ప్రపంచీకరణ దేశంలోకెల్లా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే ఎక్కువ హడావిడి జరిగినట్లుగాను ప్రపంచీకరణ సాహిత్యం కూడా భారతీయ భాషలలోకెల్లా తెలుగులోనే ఎక్కువ వచ్చింది. ప్రపంచీకరణ సాహిత్యమంటే ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యమనీ, తెలుగు రచయితలు ప్రపంచీకరణను ఇప్పటిదాకా వ్యతిరేకించే వాళ్ళేగాని, ఆమోదించిన వాళ్ళు లేరు. ఉన్నా అత్యల్ప సంఖ్యాకులు, మన స్థానికతను, మన మూలాలను, మన వృత్తులను, పంటలను వంగడాలను ఆట పాటలను, మన ప్రకృతిని, మన మానవ సంబంధాలను సారాంశంలో మన జీవితాన్ని ప్రపంచీకరణ ఎలా విధ్వంసం చేస్తున్నదో ఈ కథలు వివరిస్తాయి.

గ్లోబలైజేషన్ కారణంగా సామాన్యుడి జీవితం ఎలా ఛిద్రమైపోతుందో రచయిత గొరుసు జగదీశ్వరరెడ్డి "గజ ఈతరాలు" కథలో వివరించారు.

పూర్ణమ్మ కొడుకు రాజు, రాజు పుట్టిన ఆరు నెలలకే రాజు తండ్రి పాలమూరు లేబర్‌గా వుండి, బళ్ళారి వైపు వెళ్ళితె అక్కడే వేరేవారితో కాపురం చేస్తూ చాలాకాలం రాకపోతే కొడుకు సర్వస్వంగా భావించి అన్ని పనులు చేస్తూ, పనులులేని సమయాన కట్టెలు కొట్టుతూ బతుకుతుంటుంది. పూర్ణమ్మ ఇంటికి ఎదురుగా మహబూబ్‌నగర్ నుండి వనపర్తికి ట్రాన్స్‌వరయిన పోలీసుకుటుంబం ఉంటుంది.

పూర్ణమ్మ తన కొడుకు రాజుతో పాటు పోలీసు కొడుకును కూడా అడవికి కట్టెలకోసం తీసుకుపోయేది. వందలమందికి ఈత నేర్పిన పూర్ణమ్మ పోలీసు కొడుకుకు కూడా నేర్పి గురువవుతుంది. రాజు చదువు విషయంలో పూర్ణమ్మ ఎక్కువ శ్రద్ధ వహించేది. ఒక రోజు ఎదురింటి పోలీసు భార్యతో పూర్ణమ్మ "తండ్రిలేని బిడ్డ రెడ్డమ్మ నేను ఎంత కష్టం వున్నాగాని నాపానం బోయినగానీ గీని సద్వుమాన్పియ్య సదువుకుంటే గీ గాడ్డి కష్టం తప్తది. యా సర్కారు నౌకరన్న వస్తది. నాకు పెట్టకుంటేవాయె. వీని పెండ్లం పిల్లలనన్న సుకంగ సాక్కుంటాడు" అని చెపుతుంది. రాజు, పోలీసు కొడుకు స్నేహంగా వుండడంతో పూర్ణమ్మ పోలీసు కొడుకును తన పెద్ద కొడుకుగా భావిస్తూ ప్రేమతో చూసేది.

కొంతకాలం తర్వాత పోలీసుకు ట్రాన్స్‌ఫర్ రావడంతో వనపర్తి నుంచి గద్వాల దగ్గరున్న ఉప్పేరుకు పోతుంటే, పూర్ణమ్మ పోలీసు కొడుకును దగ్గరకు తీసుకొని కండ్లలో నీళు ్ళ పెట్టుకొని "కొడుకా గిన్ని రోజులు నా పిలగాని లెక్క మా ఓని జతనుంటివి. నా ఎంబడి అడవుల్ల తిరిగినవ్. పుట్టల్ల చెట్టల్ల తిర్గినవ్. బావ్ల దూకి, మాజత నీదినవ్. నా పెద్ద కొడుకు వనుకున్న రెడ్డమ్మా... యాడిపోయిన మమ్మ మర్వకుతల్లీ" అని అంటే రెడ్డమ్మ కూడా కండ్లలో నీళ్ళు పెట్టుకుంటుంది.

రాజు పది పాసయిన తర్వాత ఐ.టి.ఐ. చదివి గవర్నమెంట్ కంపెనీలో పట్నంలో ఉద్యోగం వస్తే పూర్ణమ్మ కూడా పట్నం పోతుంది. కొంత కాలం తర్వాత కంపెనీ నష్టాలలో వుండి జీతాలు ఇయ్యని పరిస్థితిలో పూర్ణమ్మ గుండెకు సంబంధించిన రోగం రావడంతో కంపెనీ దావఖానాలో రాజు పూర్ణమ్మకు చూపిస్తాడు. ఆరునెలల నుంచి జీతాలు లేకపోవడంతో పిల్లలకు ఫీజులకు,

ఇంటి బాడుగులకు, తాడికి, ఇబ్బంది పడుతున్న కొడుకును కోడలను చూసి "అప్పులు దెచ్చి మందులు కొనకండ్రి. నేను గిట్లనే సస్త. నా కోసురం అప్పులపాలు గాకుండ్రి" అని కొడుకు కోడలుతో అని ఊరిమీద ధ్యాస వచ్చిందని, కొడుకు కోడలు వద్దంటున్న బస్సెక్కి ఊరికి పోయి, ఎవరితో మాట్లాడక, తిండి తినక రాత్రి సమయంలో కర్ణం బాయి దగ్గరకు పోయి, కాళ్ళకు తాడు కట్టుకుని బావిలోకి దూకి ఆత్మహత్య చేసుకుంటుంది. చిన్ననాటి టీచర్, పెండ్లిలో పోలీసు కొడుకును కలుస్తుంది. పూర్ణమ్మ విషయం చెబితే విని ఇరవైఐదు సంవత్సరాల తర్వాత వనపర్తికి పోతాడు. పూర్ణమ్మ ఇంటి దగ్గర ఆనాటి పరిచయం వున్న వ్యక్తులను కలిసి, పూర్ణమ్మ ఆత్మహత్యకు కారణం తెలుసుకొని బాధపడుతాడు.

ప్రపంచీకరణ ఫలితంగా ఉద్యోగ రంగంలో సంస్కరణల పేర జరిగిన భయంకర పరిణామాల వల్ల ఉద్యోగులు భద్రత తగ్గిపోయిన తీరును ఈ కథ వివరిస్తుంది.

నగర జీవితంలోని మనుషులు ఒక ఇంట్లో ఉంటున్నా, పరస్పరం దూరంగా బతుకుతున్న తీరును "అంత్యాక్షరి" కథ వివరిస్తుంది.

దుర్గమ్మ, దుర్గమ్మ భర్త ఇద్దరు టీచర్లు, వీరికి స్రవంతి ఒకే ఒక కూతురు. దుర్గమ్మ స్రవంతిని మగపిల్లలతో కలసి తిరగవద్దంటే నోట్సులిచ్చుకోవడం, తీసుకోవడం తప్పా అమ్మా? అని స్రవంతి అంటుంటే "ఆడపిల్లలూ, మగపిల్లలూ కలసి చదువుకుంటున్నారు. నీకు తెలియందేముంది? ఎవరి జీవితాన్ని వాళ్ళు దిద్దుకుంటారు" అని స్రవంతి తండ్రి భార్యకు సర్దిచెపుతాడు. కులాంతర వివాహం చేసుకొని కర్నూలు నుంచి ఉత్తరం రాసిన స్రవంతిని తలచుకొని దుర్గమ్మ ఏడుస్తుంటే "ఇద్దరూ ఎం.డి.లు వాళ్ళు సంపాదన వాళ్ళకుంది. వాళ్ళ జీవితం వాళ్ళది. అది మనది కాదు" అని భర్త అనునయిస్తాడు.

స్రవంతి, భర్త శర్మలు హైదరాబాద్‌లో నర్సింగ్‌హోమ్ నిర్వహిస్తూ బిజిగా వుంటారు. వీరికి ఒకే కూతురు సుషమ. నూతన గృహ ప్రవేశం నిమిత్తం దుర్గమ్మ హైదరాబాదుకు వస్తే భర్త ఇంటిదగ్గరే వుంటాడు. సుషిత తల్లిదండ్రులిద్దరు డాక్టర్లుగా బిజిగా వుండటంతో, దుర్గమ్మకు మనువరాలు సుషమ బాగా సన్నిహితం అవుతుంది. సుషమ చదువుతున్నా పనులు చేస్తున్నా, టీ.వి. చూస్తున్నా, స్నేహితులతో ఆడుకుంటున్నా మధ్యలోనే బోర్ అంటు వుంటుంది. ఇది గమనించిన దుర్గమ్మ తనకు బోర్ కొట్టదా? అని ప్రశ్నించిన మనువరాలుకు, తనకు స్కూలు తనిఖీకి వస్తానని రాని ఇన్‌స్పెక్టరు రాకపోయినా, స్వాతంత్ర్య దినోత్సవం రోజున వచ్చిన అతిథి పిల్లలకు అర్థంకాకుండా మాట్లాడినా బోర్ కొట్టేదని తెలిపితే అవి చిన్ననాటి సంగతులని మనవరాలు అంటే, మాకు బోర్ కొట్టె తీరిక వుండేదికాదని నిత్యం ఆడుకునే ఆటలు గూర్చి చెబుతూ, వెన్నెల రాత్రుళ్ళలో ఆడే పిసుళ్ళ గూర్చి అడిగి నేర్పమంటే ఎలా ఆడాలో నేర్పిస్తుంది మనవరాలుకు దుర్గమ్మ. నిత్యం చేసే స్కిప్పింగ్ కన్న పిస్తుళ్ళ బాగున్నాయని చేసిన తర్వాత మనుమరాలు అంటే "నీవు ఏదైనా నేర్చుకుంటావు. నీకు మంచి పట్టుదల ఉంది పాపా అని దుర్గమ్మ అంటే ఉబ్బి తబ్బిపోయి హోమ్ వర్క్ పూర్తి చేస్తానని వెళ్ళిపోతుంది సుషమ.

ఆదివారం ప్రయాణమైపోతున్న దుర్గమ్మ దగ్గరకు సుషమ వచ్చి "అవ్వా చూడు! ఈ గీత చివరి అక్షరం స్త్రీ అంది. స్త్రీలో చివరి అక్షరం ర తో నేను పాటను మొదలు పెట్టా. గీత కాదంటుంది. ఇది ఎటూ చెప్పదు" అంటే "ఆ అక్షరాన్ని సీ త ర అని విడదీయ్యడం పాపా!" అని, వివరణ సరైనది కాదని మనసులో అనుకుంటుంది. ఇంకో అమ్మాయి "మామ్మా! స్త్రీ అంటే భార్య, ఆడ జంతువు అని రెండు అర్థాలున్నాయని మా సంస్కృత మాస్టారు అన్నది నిజమేనా అంటే సమాధానం చెప్పదు దుర్గమ్మ" ఆ సంస్కృతం మాష్టారు బోర్... ఆ ఆట అంతా బోర్! అంటూ తనగదిలోకి పోతుంది సుషమ.

**ప్రపంచీకరణ దేశంలోకెల్లా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే ఎక్కువ హడావిడి జరిగినట్లుగాను ప్రపంచీకరణ సాహిత్యం కూడా భారతీయ భాషలలోకెల్లా తెలుగులోనే ఎక్కువ వచ్చింది. ప్రపంచీకరణ సాహిత్యమంటే ప్రపంచీకరణ వ్యతిరేక సాహిత్యమనీ, తెలుగు రచయితలు ప్రపంచీకరణను ఇప్పటిదాకా వ్యతిరేకించే వాళ్ళేగాని, ఆమోదించిన వాళ్ళు లేరు. ఉన్నా అత్యల్ప సంఖ్యాకులు,**

ఆర్థిక సంస్కరణల పుణ్యాన కార్మికుల జీవితాల్లో చోటుచేసుకున్న అభద్రతా భావాన్ని ఆడెపు లక్ష్మీపతి "జీవన్మృతుడు" కథలో వివరించారు.

తండ్రి చిన్నతనంలోనే మరణించడంతో తల్లి, తమ్ముడు, చెల్లెలు కష్టపడి తాము పస్తులుండి చదివిస్తారు. స్కూలు డే సందర్భంగానైనా మంచి బట్టలు వేసుకురారా అని హెడ్‌మాస్టర్ ఎర్రని ఎండలో నిలబెట్టుతాడు. మేనమామ వచ్చి "అక్కా ఇంకెన్నాళ్లు రెక్కలు ముక్కలు చేసుకుంటావ్? పిల్లవాడు ఎదిగాడు ఇంకా ఏమి చదివిస్తావులే, వీడిని బొగ్గుగనిలో పనిలోకి దింపుదాం" అంటే "నా గొంతులో ఊపిరి ఉండగా నా కొడుకును బొగ్గు పొరల్లోకి పంపనుగాక పంపను. వీడి తండ్రిని నమిలిని రాకాసి కొరలకు ఈడినీ అప్పగించడానికి నా చేతులురావు అన్నయ్యా" అని అంటుంది. తల్లి తను పనిచేసే చోట వారు మిగిల్చి ఇచ్చిన ఆహార పదార్థాలను తెచ్చి, ఈ వ్యక్తికి పదార్థాలను పెట్టి వారు పచ్చడి మెతుకులు తినేవారు.

ట్రయినింగ్ తర్వాత ఇరవై సంవత్సరాలకే పర్మనెంట్ ఉద్యోగం వస్తుంది. సంపన్న కుటుంబం నుండి రుక్మిణిని పెండ్లి చేసుకుంటాడు. ఇద్దరు కూతుళ్ళు, ఒక కొడుకు కలుగుతారు.

తమ్ముడు తన దగ్గరుండే చదువుతుంటే భార్య రుక్మిణికి నచ్చక నీ తమ్ముడికి డబ్బంతా ఖర్చుపెడితే మన పిల్లల పరిస్థితి ఏమిటని చదువు మాన్పిస్తుంది. అన్న పనిచేసేచోటనే తమ్ముడు లేబరుగా చేరితే మీరు ఆఫీసరు మీ తమ్ముడు లేబరు ఒకేచోట అని తెలిపి, ఇంటి నుంచి పోయేంతవరకు వదలదు రుక్మిణి, తల్లిని, పల్లెటూరి నాటు అని, చెల్లెలును పనిమనిషి అని అందరికి తెలుపుతూ వారిని ఇంటి నుంచి పంపిస్తుంది. అత్తింటివాసనను దగ్గరకు రానీయదు భార్య.

తమ తల్లి ఆరోగ్య పరిస్థితి సరిగా లేదని, నిను చూడాలని తలుస్తుందని తమ్ముడు లెటరు వ్రాస్తే లెటరును కనబడకుండా దాస్తుంది. రుక్మిణి తన కొడుకు ఇంజనీరు కావాలని ఆశిస్తే కనీసం క్యాలిఫైకాడు. కూతుర్ని డాక్టర్ని చేయాలని ఆశిస్తే చెడు తిరుగుళ్ళు తిరుగుతుంటుంది. హోదాలు, హూందాతనం కావాలని రుక్మిణి తలుస్తుంది. కంపెనీ నష్టాలలో వుండి ఎపుడైనా మూసివేసే స్థితి వుండటంతో, ఉద్యోగం పోయే పరిస్థితి ఉందని తలుస్తాడు. ఆపరేటర్‌గా చార్జిమన్‌గా, షిఫ్ట్ఇన్‌చార్జ్‌గా, అసిస్టెంటు ఇంజనీరుగా ఇరవై సంవత్సరాల అనుభవం వుండి, అందరిచేత మన్ననలు పొందుతూ తల్లికి, తమ్ముడికి, చెల్లెలికి ఏమాత్రం సహాయం చేయలేని స్థితిలో వుంటాడు. కంపెనీని లాకౌట్ ప్రకటించిన తర్వాత వేరే దేశాలకు పోయి ఉద్యోగం సంపాదించి నెల నెలకు భార్యకు డబ్బులు పంపుతుంటాడు. ఆరోగ్యం బాగాలేని తన తల్లిని మాత్రం చూడలేనని, ఆ తల్లికి తన తమ్ముడే కొడుకని తనను మరిచిపొమ్మని, తల్లిని సాకె బాధ్యత తమ్ముడిదని తెలుపుతూ ఇంటికి లెటరు వ్రాస్తాడు.

**ఆర్థిక సంస్కరణల పుణ్యాన కార్మికుల జీవితాల్లో చోటు చేసుకున్న అభద్రతా భావాన్ని ఆదెవు లక్ష్మీపతి "జీవస్మృతుడు" కథలో వివరించారు.**

ప్రపంచీకరణ లక్ష్యంగా గల నూతన ఆర్థిక విధానాల ఫలితంగా ప్రభుత్వరంగ సంస్థల మూసివేత, చిన్న పరిశ్రమల మూసివేత ముమ్మరమవుతున్న సందర్భంలో ప్రయివేటు, పారిశ్రామీకరణకు మార్గం సుగమం చేయబడుతున్న స్థితిలో మానవ సంబంధాలలో తెస్తున్న మార్పును ఈ కథ వివరిస్తుంది.

ఆర్థిక సంస్కరణల ఫలితంగా కంపెనీలను లాకౌట్లుగా ప్రకటించడం, కార్మికుల పనిహక్కుకు భంగం కలిగించడం, న్యాయం కార్మికుల పక్షాన వున్నా, లాకౌట్లు అన్యాయమూ, అక్రమమూ అని కోర్టులు తీర్పులిచ్చినా, రాజకీయ నాయకుల అండతో, మేనేజర్లు అవినీతిపరులై కంపెనీలను మూయడంతో కార్మికుల జీవితాలు బజారున పడి, ఆర్థిక లేమితో సొంతవారిని దూరం చేసుకునే పరిస్థితులకు ఈ కథ తార్కాణం.

విస్తరిస్తున్న కంప్యూటర్ సంస్కృతిని జానపద కథా ధోరణిలో విమర్శనాత్మకంగా లెనిన్ ధనిశెట్టి 'సిహెచ్‌టిటిపి/డబ్ల్యూడబ్ల్యూడబ్ల్యూ.యంత్రరాక్షసి.కం!' అనే కథలో వివరించారు.

యోగనిద్ర నుండి మేల్కొనిన రాజు వీరసింహుడు కాఫీ తెమ్మని తన పట్టపురాణికి కేక వేస్తాడు. ఆమె రాలేదు. తన ఇద్దరి పిల్లల్ని పిలుస్తాడు. వారు పలకరు. పక్కవాటాలోకి వెళ్ళి ఉంటారని రోడ్డుమీదకి వస్తాడు. రోడ్లు నిర్మానుష్యమై ఎవరూ కనబడక పోవడంతో బంధువులకు ఫోన్లు చేస్తాడు. రింగవుతున్నా ఎవరూ ఎత్తకపోవడంతో, ఏదో దుష్టశక్తి తన సామ్రాజ్యాన్ని ఆవహించిందని కాళీమాత వరప్రసాదిత ఖడ్గాన్ని జైభీమ్ నామస్మరణ చేసుకుంటూ ఎన్‌ఫీల్డ్ బుల్లెట్ అశ్వంపై నగరం వైపు పోతాడు.

మెట్రో పాలిటన్ మహాజనారణ్యంలో ఎవరూ కనబడకపోతే పక్క ఊరికిపోతే అక్కడ మైదాన ప్రాంతం పచ్చగా వుండి, చెట్లకు గుత్తులుగా వేలాడే అడవి ఐస్‌క్రీములు తిని కోకోకోలా తాగి ఓమ్రి చెట్టు కింద నిదరపోతే పక్షుల కిలకిలా రావాలు విని చెట్టు కొమ్మపై వున్న పక్షులు మాట్లాడుకొనేది వింటాడు. "కేపిటలిస్టు కంప్యూటర్ భూతం నగరాలను నగరాల మనుషుల్ని అమాంతంగా మింగేస్తున్న విషయం పాపం ఈపిచ్చి మారాజుకు తెల్సినట్టు లేదు" అని అంటుంది మొదట పక్షి.

'అవునవును మనం ఎంతో తపోశక్తి వుందనుకొన్న మన మార్కీయ మహర్షిని కూడా అనుచరులతో మింగేసింది భూతం' అని రెండో పక్షి అంటుంది.

'అది భూతం కాదు. బ్రహ్మనుసైతం శాసించగల బ్రహ్మరాక్షసి అని మూడో పక్షి.

ప్రపంచ సమాచార విషయాలు, వింతలు తన దగ్గర నిల్వ ఉంచుకొని, కావలసినపుడు క్షణంలో అందిస్తూ ప్రతిపనిని వేగవంతం కావడానికి ఉపయోగపడుతూ, మానవుని మేధస్సును స్వీకరించి, శ్రమను తగ్గిస్తూ అన్ని అవసరాలను తీరుస్తున్న కంప్యూటర్, మానవుడు నిర్లక్ష్యంగా వుండి ఆరోగ్యం దెబ్బ తినడానికి, సొంతంగా ఆలోచన చేసే శక్తి లేనివారుగా తయారుకావడానికి కారణమైన కంప్యూటర్, మానవుని మనుగడ ప్రశ్నార్థకం కావడానికి దోహదం చేసిన విషయాలను గూర్చి ఈ సిహెచ్‌టిటిపి/డబ్ల్యూడబ్ల్యూడబ్ల్యూ యంత్రరాక్షసి.కం కథ వివరిస్తుంది.

పర్యావరణాన్ని కాపాడుకునే రైతు విధ్వంసానికి దిగాల్సిన, సామాజిక వైరుధ్యాన్ని సృష్టిస్తున్న రాజకీయార్థిక కోణాలను ముందుకు తీసుకొచ్చిన విధం గూర్చి రచయిత పాపినేని శివశంకర్ "చింతతోపు కథ" లో చిత్రీకరించారు.

ఈ కథలో వరదయ్యకు కొద్దిగా భూమి వుండి, మూడు తరాలనుంచి వారసత్వంగా వస్తున్న చింతలతోపు వుండడం, పంటలు పండితే ధరలు వుండకపోవడం, ధరవుంటే పంటలు రాకపోవడం, చేసిన అప్పులు తీర్చే పరిస్థితి రాకపోవడం, ఏమి తోచక పొగాకు పంట ద్వారా తన అప్పులు తీరడంలేదని రెండెకరాలలో వున్న చింతల తోపు తీసేసి వాటి స్థానంలో పత్తివేస్తే తన అప్పులు తీరుతాయనే ఆశతో బాధతో వాటిని కొట్టివేయడం

అనే వరదయ్య స్థితిని చూస్తే, నేడు దేశవ్యాప్తంగా రైతులు ఇలాంటి పరిస్థితి ఎదుర్కొనడానికి కారణం ప్రభుత్వవైఫల్యం అని తెలుస్తుంది. ప్రభుత్వం మధ్య దళారులపైన, రాజకీయ నాయకులపైన, అధికారులమీద సరైన నిఘా పెట్టకపోవడం, రైతులను మోసం చేస్తున్నవారు ఎవరు అనేది తెలిసి కూడా శిక్షించకపోవడం, రైతులకు ప్రభుత్వం కల్పిస్తున్న ప్రోత్సాహకాలు ఎంతవరకు లాభం చేకూర్చుతున్నది ఆలోచించక పోవడం నష్ట నివారణను తొలగించకపోవడం వల్ల రైతులు అప్పులు తీర్చలేక కొందరు ఆత్మహత్యలు చేసుకుంటే కొందరు వ్యవసాయం వదిలి వలసలు పోతూ దుర్భరంగా రైతులు బ్రతికే స్థితి ప్రపంచీకరణం వల్లనే అనేది ఈనాడు వుందని ఈ కథ తెలుపుతుంది.

నగరంలో చిన్న వ్యాపారుల నివాసాలను పెద్ద వ్యాపారులు ఆక్రమించుకోవడం, నగరం త్వరత్వరగా మారిపోవడం, ప్రేమ విషయంలోనూ అదే జరగడం గూర్చి 'ఇన్‌స్టంట్‌లైఫ్' కథ వివరిస్తుంది.

ఈ కథలో అరుంధతీ తల్లిదండ్రులు ఆదర్శ భావాలుండి, పెద్దల నిర్ణయం వ్యతిరేకించి పెళ్ళిచేసుకుంటే, తల్లి ఆ భావాలతో సాదాసీదాగా వుండి విలువలకు కట్టుబడి జీవించినదిగా కనబడితే, విలువలకు తిలోదకాలిచ్చి అధికారం అక్రమార్జనవైపు పోయిన పాత్ర అరుంధతీ తండ్రిగా ఈ కథలో కనబడుతారు.

**విస్తరిస్తున్న కంప్యూటర్ సంస్కృతిని జానపద కథా ధోరణిలో విమర్శనాత్మకంగా లెనిన్ ధనిశెట్టి 'ని హెచ్‌టిటివి/దబ్ల్యూ దబ్ల్యూ దబ్ల్యూ.యంత్రరాక్షసి.కం!' అనే కథలో వివరించారు.**

భార్య విలువలు భర్తకు నచ్చక నిత్యం వాదులాడుతున్నా ఇరవై సంవత్సరాలు కొంచెం కొంచెం మారిపోతున్న భర్తను చూసి భార్య బాధపడినా ఇద్దరు విడిపోకుండా వుంటారు. అదే సందీప్ ఏడురోజులు, పదునాలుగు గంటల్లోనే ఈ తమ ఐదేళ్ళ స్నేహం దూరమైయ్యేటట్టు తీసుకున్న నిర్ణయం తీరు చూస్తే ఈనాటి తరం తీసుకునే నిర్ణయాలు, ఆనందాన్ని కలుగజేస్తాయో, విషాదాన్ని నింపుతాయో తెలుపడం కష్టం అని ఈ కథ తెలుపుతుంది. పద్నాలుగు గంటలలో మారిపోయే సందీప్ లాంటి వారు భవిష్యత్తులో కలసి శాశ్వతంగా వుంటారనే నమ్మకం ప్రస్తుత పరిస్థితులలో యువకులలో అందులో ఎక్కువ శాతం చదువుకున్నవారిలో లేదని తెలుపుతుంది ఈ కథ.

దర్జీపని వృత్తిగాగల ముస్లిం వ్యక్తులకున్న ప్రత్యేక ఉనికిని, గౌరవాన్ని అభావం చేస్తున్న తీరును, వారి జీవన విధానంలో రెడీమెడ్ వస్త్రపరిశ్రమలు తెచ్చిపెడుతున్న సంక్షోభాన్ని గూర్చి "న్యూ బాంబేటైలర్స్" ఈ కథ వివరిస్తుంది.

ఈ కథలో పేదరికాన్ని ఎదుర్కొనలేక కొడుకును సాకలేని పరిస్థితిలో నెల్లూరు పంపించి ఉర్దూ చెప్పే ఉస్తాదు చేయాలని తండ్రి భావిస్తాడు. గుడ్డలుకుట్టే ఉస్తాదు అయి వృత్తిని పవిత్రంగా భావిస్తూ, మంచి పేరు తెచ్చుకొంటాడు. "పని నేర్పించి, వారికి "పీరుబాయి శిష్యుడు" అనే పేరు వచ్చేవిధంగా తయారుచేస్తాడు. ఎంతో మంది చేత గౌరవంగా "బాంబేటైలర్స్"గా పేరుపొందుతాడు. రెడీమేడ్ ఫ్యాక్టరీల రాకతో కూలీలు తక్కువ ఇస్తున్నారని చెప్పి అందరు ఫ్యాక్టరీలకు వెళ్ళిపోవడం జరుగుతుంది. తక్కువ ధరలో వస్త్రాలు దొరకడం చేత కుట్టడానికి వస్త్రాలు రాక సంపాదన లేక వస్తులున్న సమయంలో ఫ్యాక్టరీకే కూలీగా పోవాలని నిర్ణయించుకొంటాడు. తననే పరీక్షించాలనే యజమానుల పద్ధతిని వ్యతిరేకిస్తాడు. కొడుకును మనకు ఇది వద్దురా పోదాం అని రాకుంటే "వొద్దురా పాతగుడ్డలు కుట్టుకొని బతుకుదాం. ఆడోళ్ళరైకలు కుట్టుకొని బతుకుదాం. అదీ చేతగాకపోతే యింత విషం తీసుకొని మన షాపులో మనం చద్దాం. అంతేగాని మనకి పరీక్షలేందిరా. మనకు నెంబర్లేందిరా రారా" అని తన షాపునే ఆధునీకరించి ఆత్మవిశ్వాసంతో పనిని ప్రారంభించిన పీరుభాయి స్థితిని చూస్తే కష్టపడే మనస్తత్వంగల వ్యక్తిగా, కష్టాలువస్తే ఆత్మవిశ్వాసంతో ఎదుర్కొనే ధైర్యవంతునిగా పీరుబాయి ఈ కథలో కనబడుతాడు.

ప్రపంచీకరణ ఫలితంగా అన్ని రంగాలలో ప్రభుత్వ పాత్ర తగ్గి ప్రయివేటీకరణకు అవకాశం ఏర్పడటంతో, ఫ్యాక్టరీలు, కంపెనీలు ఏర్పడటంతో చిన్న చిన్న వృత్తులు చేసుకునేవారు అదే వృత్తిని ఫ్యాక్టరీలలో కూలీగా వుండిచేస్తూ బ్రతకవలసిన పరిస్థితి వచ్చింది. ఫీరుభాయ్ కుట్టుపని నేర్చుకొని పది మందికి జీవనోపాధి కల్పించినవాడు రెడిమేడ్ ఫ్యాక్టరీల రాకవల్ల కుట్టుపని తగ్గి సంపాదన లేకపోవడంతో, బ్రతుకు భారమై కూలీగా మారే పరిస్థితికి కారణం నూతన ఆర్థిక విధానాలే కారణమని ఈ కథ ద్వారా తెలుస్తుంది.

నగర యాంత్రిక జీవనం నుండి తనకుతాను విముక్తమయ్యే విధం గూర్చి రచయిత పాపినేని శివశంకర్ "సగం తెరిచిన తలుపు" కథ చిత్రిస్తుంది.

నగరంలో అన్ని సంవత్సరాలు పనిచేసిన రామకృష్ణను ఎవరు తనను గుర్తించనది, ప్రేమతో పలకరించనిది మనుషులు స్వార్థంగా జీవిస్తున్నది తలచుకొనిన దాన్ని చూస్తే నగరంలో పల్లెటూరులోని వ్యక్తుల మధ్య వుండే ఆప్యాయతలు, అనురాగాలు వుండవని తెలుస్తుంది. తోటి మనిషిని మనిషిగా గుర్తించకపోవటం, కష్టాలలో పాలు పంచుకోక ఎవరి బ్రతుకు వారు బిజిగా బ్రతుకుతూ, శాంతి లేక అశాంతిగా నగర జీవనం వుంటుందని ఈ కథ తెలుపుతుంది.

ప్రపంచీకరణ ప్రభావంతో పంట పొలాలన్ని వ్యాపార

భవనాలకు నిలయాలుగా మారిపోతున్న దుర్మార్గాన్ని భూమి ఆత్మకథా రూపంలో అట్టాడ అప్పల్నాయుడు "ఓ తోట కథ" కథలో చిత్రించారు.

ప్రపంచీకరణ ప్రభావంతో మనుషుల మధ్య మమతానురాగాలు, మనస్సంబంధాలూ సాంప్రదాయాలు అన్ని ఆర్థిక సంబంధాలుగా మారి మానవ జీవితానికి సంబంధించిన ప్రతి అంశాన్ని ఆర్థికమే నియంత్రించే పరిస్థితి నేడు నెలకొంది అనే విషయాన్ని రచయిత్రి నల్లూరి రుక్మిణి "పోగులు తెగిన అల్లిక" అనే కథలో వివరించారు.

పూర్ణమ్మ నారాయణరావు అనే దంపతులకు ఇద్దరు కొడుకులు ఒక అమ్మాయి వుంటారు. నారాయణరావు బడిపంతులుగా పనిచేస్తూ సిన్సియారిటీ గల వ్యక్తిగా పేరు పొందడమేకాక ప్రజాసేవకుడిగా కూడా మన్నన పొందారు. పెద్దకొడుకు ఉద్యోగ నిమిత్తం అమెరికాకు పోతాడు. పెద్దకొడుకుకు సంతానం కలిగిన తర్వాత పిల్లవాణ్ణి చూసుకునేందుకని ఇబ్బందిగా వుంది అమ్మను పంపు నాన్న అంటే సమాధానంగా నారాయణరావు "ఏరా? ఎందుకంత ఇబ్బంది పడడం? కొన్నేళ్లు కోడలిని ఉద్యోగం మాన్పించు ఏమి పర్వాలేదు. సంపాదించేకునే రోజులు చాలా వున్నాయి. అయినా మీ అమ్మకేం తెలుస్తుంది. అక్కడ మీరిద్దరు ఎవరిదారిన వారు వెళ్ళిపోతే ఏదైనా అవసరం కలిగినా ఇబ్బంది కలిగినా అదేలా సముదాయించుకోగలదు. అదంతా కాదు గాని అంతగా అయితే పిల్లవాన్ని ఇక్కడ వదిలివెళు కొన్నాళ్లు అని అంటాడు. ఎవరి ఇబ్బందులు వాళ్లు గడుపుకుంటేగాని జీవితం విలువ తెలియదనే ఉద్దేశ్యంతో ఆ మాట అంటాడు నారాయణరావు అలా అనిన తండ్రికి పెద్దకొడుకు ఆరు నెలల వరకు ఫోనుకూడా చేయడు చిన్నకొడుకు కూడా ఉద్యోగ నిమిత్తం అమెరికాకు వెళ్ళిపోతాడు. చివరకు కూతురు అల్లుడు కూడా అమెరికాకు వెళ్ళిపోవడంతో తప్పనిసరి పరిస్థితులలో పూర్ణమ్మకూడా అమెరికాకు పోయి రెండేళ్ళకో మూడేళ్ళకో ఇండియాకి వస్తుంది. వచ్చినన్ని రోజులు వారిమీదే ధ్యాసవుంటూ వారికోసం నానారకాల వంటకాలు చేస్తుంది. ఈ పరిస్థితిని గమనించిన నారాయణరావు "మనం పిల్లల అవసరాలు తీర్చే మర మనుషులమే పూర్ణ! నీ అవసరం తీరగానే నీవు వాళ్ళకు ఎక్కువైపోతావే అప్పుడు నిన్ను హిందూసముద్రం దాటిస్తారే పిచ్చిదానా! నేను ఉన్నా లేకపోయినా ఈ మాటలు గుర్తుపెట్టుకో, కోడలు నీళ్లు పోసుకోవడంతో మూడు సంవత్సరాల వరకూ కూడా పూర్ణమ్మకు ఇండియా రావడానికి అవకాశం లేకపోవడంతో పూర్ణమ్మను చూడాలన్న కోరికతో అమెరికాకు పోతాడు. అమెరికాలో పలుకరించేవాడు లేక ప్రేమను పంచేవాడు కనపడక తిరిగి ఇండియాకు వస్తాడు.

ఇండియాకు వచ్చిన తర్వాత సరైన సమయానికి తిండితినక ఇతరుల సేవలకే సమయం కేటాయిస్తు వుండడం వలన ఆరోగ్యం దెబ్బతిని జాండిస్ జబ్బుతో మరణిస్తాడు. మరణవార్త తెలిసి పూర్ణమ్మతో పాటు కొడుకులు కూడా వస్తారు. భర్త మరణంతో బాధపడుతున్న పూర్ణమ్మ ఒకవైపు పరిస్థితి వుంటే, కొడుకులు మాత్రం అర్థాంతరంగా సెలవులు పెట్టాల్సి రావలసిన పరిస్థితి గూర్చి బాధపడుతారు. కొన్ని రోజులు ఊర్లో వుండి కొడుకులు తిరిగి అమెరికాకు వెళ్లిపోవడంతో తల్లి అవసరం లేదని భావించి ఊర్లోనే వదిలి వెళ్లిపోవడంతో పూర్ణమ్మ వంటరిదై భర్త ఆలోచనలను, ముందుచూపును గ్రహించలేని అజ్ఞానిగా తలచుకొని బాధపడుతుంది.

**దర్జీపని వృత్తిగాగల ముస్లింలకున్న ప్రత్యేక ఉనికిని, గౌరవాన్ని అభావం చేస్తున్న తీరును, వారి జీవన విధానంలో రెడీమెడ్ వస్త్రపరిశ్రమలు తెచ్చిపెడుతున్న సంక్షోభాన్ని గూర్చి "న్యూ బాంబేటైలర్స్" ఈ కథ వివరిస్తుంది.**

ప్రపంచీకరణ ప్రభావంతో వచ్చిన కేతు విశ్వనాథరెడ్డి రచించిన "విరూపం" కథ. ఓల్గా రచించిన "కోకా కోల" కథ, బి.యస్. రాములు కామన్‌వెల్త్ గొరుసు జగదీశ్వర రెడ్డి "బ్రతుకుగోస" బమ్మిడి జగదీశ్వర రావు "పెనం", పెద్దింటి అశోక్ కుమార్ "కీలుబొమ్మలు," వి.చంద్రశేఖర రావు "ఆవు-పులి" వంటి కథలన్నీ ప్రపంచీకరణ ప్రభావంతో వివిధ రకాల సమస్యలు ఉత్పన్నమైన విధానాన్ని వివరిస్తున్నాయి.

ప్రపంచీకరణ ప్రధాన లక్ష్యం మానవత్వ విలువలను మంటగలపడం, ప్రపంచీకరణ ప్రధానధ్యేయం ఆరోగ్య వంతమైన మానవ సంబంధాలను వస్తువినిమయ సంబంధాలుగా మార్చడం, అగ్రరాజ్యాల దురహంకార విషవలయం ప్రపంచీకరణ, బడుగుదేశాల బ్రతికే హక్కును ఆటకట్టించే అగ్రరాజ్యాల దుష్టచదరంగం ప్రపంచీకరణం, మనుషుల్లో కత్తి వైరాన్ని పెంచి మరణమృదంగం ధ్వానాలకు తలలాడించి, తన్మయత్వం చెందే వెయ్యితలల సర్పం ప్రపంచీకరణం, తరతరాల మానవ శ్రమ సంచిత సంస్కృతి అతలాకుతలం కాబోయే ప్రమాద ఘంటికలు మోగుతున్నవి. భిన్న రూపాలలో అన్ని రంగాలలో చాపకింద నీరులా, కాళ్లకింద నాచులా పరుచుకుంటున్న ప్రపంచీకరణ దుష్ప్రభావాన్ని మనమందరం వ్యతిరేకించి అందుకై ఉద్యమించాలి. ఉద్యమ స్ఫూర్తితో సమస్య అవగాహన చైతన్యంతో విస్పష్ట రాజకీయ దార్శనికత్వపు జెండా రెపరెపలతో జనరాశులు పిడికిల్లు బిగించి హోరెత్తి నినదించిననాడు ప్రపంచీకరణ ఎత్తుగడలు నీటి బుడగలు అవుతాయి.

# మనప్రాణదాత, మనజీవన ధాతువు

- డా॥ శాంతి నారాయణ
9533122329

చలనం లేకుండా బండబారిన
మేరునగ ధీరత్వాన్ని నేను నిజంగా చూల్లేదు,
అయితే నేను చూశాను-
ఎడారి నేలలో ఏటా యెండిపోతూ
ప్రతి తొలకరిలో వేరుశెనగ మొక్కై
నిటారుగా తల పైకెత్తుతున్న 'అనంత' రైతన్నను నేను చుశాను.,

కీర్తికోసం అడిగిన వారికి అడిగినంతే ఇచ్చిన
కర్ణ - శిబిచక్రవర్తుల ఔదార్యాలను నేను నిజంగా చూల్లేదు,
కానీ నేను ప్రత్యక్షంగా చూశాను-
అప్పుల పాలవుతూనే నాగలిపట్టినందుకోసం
పరాన్నజీవులందరికీ ప్రాణభిక్షపెడుతూ
ఆకలి సెగల్లో తృప్తిపడుతున్న 'సీమ' అన్నదాతను
నేను ప్రత్యక్షంగా చూశాను.,

చర్యకూ ప్రతిచర్యకూ అన్నిటికీ తానే కారణమై
తనది కానికీర్తిని దక్కించుకున్న భూదేవి సహనశీలతను
నేను నిజంగా చూల్లేదు.,

అయితే నేను స్పష్టంగా చూశాను-
ప్రకృతీ కాలమూ కాటేస్తున్నా, ప్రభుత్వాలు ముఖం చాటేస్తున్నా
ఆరుగాలం మగ్గిపోతూ ఆశించిన పంటరాక,
గిట్టుబాటు రేటు దక్కక
రుణంపుండు సలుపుతున్నా, ఇంటిపరువు నలుపుతున్నా
నమ్ముకున్న నేలనుమాత్రం వదలని ఈ దేశ రైతన్నను
నేను స్పష్టంగా చూశాను.,

శతాబ్దాలుగా అద్భుత స్థానమైన తాజ్‌మహల్ కళాకృతిలో
ఎవరెవరి శ్రమసౌందర్యం ఎంతెంత సమ్మిళితమైందో
నేను నిజంగా చూల్లేదు,

అవును నేను క్షుణ్ణంగా గమనించాను
సర్వమానవ మోహన శరీర, ప్రాణ సౌందర్యాల పోషణకోసం
పొలం కోండ్రలో నుంచీ ఏతమెత్తిన రైతు జీవధారను
నేను క్షుణ్ణంగా గమనించాను.,

ఉజ్జయినీ రాజ్యసింహాసనం కోసం
అర్థరాత్రి చెట్టెక్కి కింద సలసల కాగుతున్న
ఉష్ణ కాసారంలోని త్రిశూలంపైకి దూకిన
విక్రమార్కుని సాహసాన్ని
నేను నిజంగా చూల్లేదు,

కానీ నేను నిరంతరం గమనిస్తున్నాను-
ఏమి దక్కుతుందో ఎంత దక్కుతుందో తెలియకుండానే
సేద్యం సుడిగుండంలో అనివార్యంగా దుంకుతున్న
సీమ రైతన్న ధైర్యాన్ని
నేను నిరంతరం గమనిస్తున్నాను.,

అవును నిజంగా నేను
మహోన్నత మానవమూర్తిని మన ప్రాణదాతను చూశాను



ఇప్పుడన్నీ కోల్పోయిన, ఆపన్నుడయిన అన్నదాతను
చూస్తున్నాను.
సేద్యం నష్టమన్న చోటనే
మట్టిని ముద్దాడుతున్న ప్రేమికుడతడు,
వ్యవసాయం ప్రమాదమన్న చోటనే
నాగలి కదుతున్న కర్షక నిబద్ధుడతడు,
'విత్తు' వద్దన్న చోటనే
మట్టిని పగల జీల్చుకొని వొచ్చే విత్తనమతడు,
ఎండిపోతావన్నచోటనే
మొండిగా పెరుగుతూ వొస్తున్న మొక్కతడు

అవును నిజంగా రైతు
ఒక మేరు పర్వతం - ఒక శిబి చక్రవర్తి
ఒక భూదేవి - ఒక శ్రమ సౌందర్యరాశి
ఒక సాహస విక్రమార్కుడు - ఒక మానవీయసుగంధం
ఒక కుప్పబోసిన ఈ దేశ జాతి సంస్కృతి
అవును నిజంగా నేను
రమణీయ రైతుకథా సంభరితమైన మన పల్లె చిత్రాలను
చూశాను
ఇప్పుడన్నీ బోసిపోయిన, కళదప్పిన
మానవీయక్షేత్రాలను చూస్తున్నాను.
అవును, నిజంగా పల్లె
ఈ జాతి జీవధాతువు, ఈ దేశవృద్ధిహేతువు
ఒక తియ్యని స్మృతుల సెలయేరు,
చిన్ననాటి కమ్మని కలల జలతారు
గుండెగూటిలో పొదిగిన జీరంగి,
యెదలో మరులరాగాలు పలికే సారంగి
బాల్యానికి రెక్కలు కట్టిన తూనీగ,
మనసుపుస్తకంలో వొదిగిన నెరుల నెమలీక
అవును, నేను ఆర్తితో మన అన్నదాతను చూస్తున్నాను
అవును, నేను తపనతో మన జీవధాతువును చూస్తున్నాను
చూసి చూసి ఆదుకోలేని నిస్సహాయస్థితిలో
అక్షరాలను చైతన్యదీపాలుగా మారుస్తున్నాను
ఆ దీపాలకు తగిన దిశానిర్దేశాన్ని కోరుకుంటున్నాను.

# వివక్షలను ప్రశ్నించిన కవిత్వం




ప్రపంచీకరణ వల్ల మానవ సంబంధాలలో విపరీత పోకడలు రావడం, స్త్రీ జీవితం మరింత అన్యాయం కావడం, పర్యావరణం విచ్ఛిన్నం కావడం, జనంలో స్వార్థం సిగ్గుపడవలసిన గుణం కాకుండా పోవడం. సారాంశంలో ప్రపంచ మానవ జీవితంలో సహజ సామరస్యం దెబ్బతినడం - ఇదీ విజయలక్ష్మి పండిట్ కవిత్వంలో వస్తువు. ఈ దుష్పరిణామాల పట్ల ఆమె ఆవేదన చెందారు. ఆగ్రహం చెందారు. ప్రశ్నించారు. నిలదీశారు. బుద్ధి చెప్పారు.

- రాచపాలెం చంద్రశేఖర రెడ్డి

9440222117

'నా జీవితమే ఒక కవిత్వం
కవిత్వమే నా జీవితం'

అని ప్రకటించుకున్న ఆత్మస్థైర్యంగల కవయిత్రి పి. విజయలక్ష్మి పండిట్. ఈమె పత్రికల్లో సభలలో, సంఘాలలో, సంస్థలలో కనిపించరు వినిపించరు. కాని ఆధునిక తెలుగు కవిత్వ చరిత్ర నిర్మాణంలో భాగస్వామ్యం వహిస్తుంటారు. ఈమె నిశ్శబ్ద కవిత్వకెరటం. పి.విజయలక్ష్మి చిత్తూరు జిల్లా మదనపల్లెలో పలవల సుబ్బమ్మ రామకృష్ణా రెడ్డిల కుమార్తె. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయంలో వృక్షశాస్త్రం చదివి, డా.బి.ఆర్.అంబేద్కర్ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పనిచేస్తున్నారు. దూరవిద్యావ్యవస్థ మీద విశేష కృషి చేశారు. సంగీతం, చిత్రలేఖనం, ఎంబ్రాయిడరీ, కవిత్వం వంటివి విజయలక్ష్మికి ఆత్మకళలు. విశ్వవిద్యాలయం విద్యార్థిగా ఉన్నప్పుడే 'అనుకుంటున్నాను' అనే కవిత రాసిన విజయలక్ష్మి, తాను నివసించే సమాజం పట్ల తనకు గల అభిప్రాయాలను, ఈ సమాజంతో తాను చేసే సంభాషణను అయిదు కావ్యాలలో చెప్పారు. అవి. 1.మానవత్వమా! ఏది నీ చిరునామా? (2005) 2. ధరిత్రీ విలాపం (దీర్ఘకావ్యం 2009), 3. ఆకాశంలో అర్థభాగం (ధీర్ఘకావ్యం 2009) 4. విశ్వపుత్రికను నేను - విశ్వశాంతి నా ఆకాంక్ష (2012) నా ఆత్మకళలు (2012) ఇవిగాక రవీంద్రనాథటాగూర్ గీతాంజలిని 'అపూర్వగానం' పేరుతో అనువాదం చేశారు. ఇంత సృజనాత్మక కృషి చేసిన విజయలక్ష్మి పండిట్ ప్రధాన కవి సమూహంలో కనిపించరు. ఆమె ఆగ్రహాన్ని, అనుగ్రహాన్ని గర్భీకరించుకున్న అంతర్ముఖ భావకవి. ఆవేదనను నింపుకున్న ఆత్మశోధనకవి.

విజయలక్ష్మి కవిత్వగమ్యం విశ్వశాంతి. దాని గమనం మానవత్వం. లక్ష్యం విశ్వశాంతి, మార్గం మానవత్వం. ప్రపంచీకరణ ఒకవైపు, ప్రాంతీయతలు మరోవైపు మన సమాజాన్ని చుట్టుముట్టుతున్న సమయంలో విజయలక్ష్మి విశ్వశాంతి ఆకాంక్షిస్తూ, దానిని మానవత్వం ద్వారా సాధించాలని కవిత్వ రూపప్రయత్న చేస్తున్నారు. ప్రపంచీకరణ వల్ల మానవ సంబంధాలలో విపరీత పోకడలు రావడం, స్త్రీ జీవితం మరింత అన్యాయం కావడం, పర్యావరణం విచ్ఛిన్నం కావడం, జనంలో స్వార్థం సిగ్గుపడవలసిన గుణం కాకుండా పోవడం. సారాంశంలో ప్రపంచ మానవ జీవితంలో సహజ సామరస్యం దెబ్బతినడం - ఇదీ విజయలక్ష్మి పండిట్ కవిత్వంలో వస్తువు. ఈ దుష్పరిణామాల పట్ల ఆమె ఆవేదన చెందారు. ఆగ్రహం చెందారు. ప్రశ్నించారు. నిలదీశారు. బుద్ధి చెప్పారు.

విజయలక్ష్మి తాత్వికంగా భావవాది. భౌతికవాది కాదు. సైన్సు చదువుకొన్నా పూర్తిగా భౌతికవాది కాలేకపోయిన పరిమితి ఆ అనేకమంది భారతీయులకున్నట్లే విజయలక్ష్మికి కూడా ఉంది. అందుకే ఆమె ప్రపంచం ఎదుర్కొంటున్న భౌతిక సమస్యలను గుర్తించి, వాటికి మానవత్వ పరిష్కారాన్ని ప్రతిపాదిస్తూ వచ్చారు. తాను భావవాది అయినా మెట్టవేదాంతి మాత్రం కాదు. విశ్రాంత వర్గ స్వభావాన్ని అలవరచుకోలేరు. సామాజిక వాస్తవికతను గుర్తించడంలో వెనకబడిపోలేదు. విజయలక్ష్మికి మతాల పట్ల అనుకూల దృష్టే ఉంది. అన్ని మతాలసారం సౌభ్రాతృత్వమే,అన్ని మతాలు మానవత్వాన్నే బోధిస్తాయని విజయలక్ష్మి నమ్ముతారు. ఇది పెద్దగా డిబేట్ చెయ్యవలసిన అంశం. అయినా విజయలక్ష్మి మతమౌఢ్యాన్ని, మత యుద్ధాలను తీవ్రంగా విమర్శిస్తారు.

భారతదేశంలో స్త్రీలు దౌర్జన్యాలకు, అవమానాలకు, వివక్షకు గురౌతున్నారు. భూమి దుర్వినియోగానికి, స్వార్థానికి బలైపోతున్నది. ఈ రెండు సమస్యల మీద విజయలక్ష్మి రెండు దీర్ఘకావ్యాలు రాశారు.

'ఆకాశంలో అర్థభాగం' స్త్రీ వాద కావ్యం, 'ధరిత్రీవిలాపం' పర్యావరణ కావ్యం. మిగతా కావ్యాలలో కూడా ఈ రెండు సమస్యలమీద అనేక కవితలు రాశారు.

మొదటి సంపుటంలో ఒకటి రెండు కవితలలో కనిపించే స్త్రీ చైతన్యం 'ఆకాశంలో అర్థభాగం'లో సమగ్రరూపం ధరించి,' నా ఆత్మకళలు' లోకి కూడా నడచుకుంటూ వెళ్ళింది. బాల్యవివాహాలను నిరసించడంతో మొదలై అద్దె తల్లులదాకా ఆమె స్త్రీ చైతన్యం విస్తరించింది. భ్రూణహత్యలతో మొదలై 'నేనూ మనిషినే' అనేదాకా కొనసాగింది. అత్తింటి ఆరళ్ళు నుంచి ప్రపంచీకరణ పీడనదాకా పరచుకుంది. ఆడపిల్లల్ని పారేయడం మొదలు కన్న తండ్రే కూతురిని నాశనం చేసే దుర్మార్గం దాకా ఆమె నిరసన విజృంభించింది. స్త్రీని బడికి పంపడం దగ్గర మొదలయిన వివక్షను ప్రశ్నించడంతో ప్రారంభమై స్త్రీ లేకుంటే మానవజాతి మనుగడ ఏమిటి? అని నిలదీసేదాకా పాకింది. విజయలక్ష్మి కవితలలో సగటు స్త్రీలతోపాటు చేనేత స్త్రీలు, జోగినులు కూడా కనిపిస్తారు.


విజయలక్ష్మి పండిట్

'నీ కడుపులోనే / నాకు రక్షణ లేనినాడు / నీవే నన్ను వద్దనుకున్ననాడు / నా కెందుకీ ఆడజన్మ' !

శాస్త్ర సాంకేతిక రంగాలు సాధించిన విప్లవాల ఫలితాలను భ్రూణహత్యలకు వినియోగించుకొనే దుర్మార్గాన్ని ఒక తల్లి గర్భంలోని పాప తన తల్లికి వేసిన ప్రశ్న ఇది. భారతదేశం వైజ్ఞానిక ప్రగతిలోని రెండో ముఖం మీద కవయిత్రి వేసిన అధిక్షేపాత్మక ప్రశ్న ఇది. అంతేకాదు అత్తింటి ఆరళ్ళలో కాలిబూడిదైపోతున్న కోడళ్ళ దుస్థితిని చూసిన కవయిత్రి "కళ్యాణ పీఠమా? బలిపీఠమా?" అని నిలదీశారు. ఆకాశంలో అర్థభాగంలో భారతీయ మహిళ ఎన్ని రకాల పీడను అనుభవిస్తున్నదో ఆవిష్కరించి, దానిని ప్రశ్నల ద్వారా, అధిక్షేపాల ద్వారా, ఆవేదనల ద్వారా, ఆగ్రహం ద్వారా కవిత్వబద్ధం చేశారు విజయలక్ష్మి.

స్త్రీ వాదం గురించిన అనేక నిర్వచనాలున్నాయి. విజయలక్ష్మి స్త్రీవాదాన్ని దేశాభివృద్ధి దృష్ట్యా నిర్వచించారు. స్త్రీలనణగదొక్కి నంతకాలం దేశాభివృద్ధి కల్లని నొక్కి వక్కాణించడమే స్త్రీ వాదమన్నది ఆమె నిర్వచనం. విద్య మొదలు వివాహందాకా, పుట్టుక నుండి ప్రేమ దాకా విభిన్న జీవిత దశలలో పురుషుల ద్వారా మహిళలు పడుతున్న అవస్థలే స్త్రీ వాద వస్తువులు. 'ఆకాశంలో సగం' అన్నది చైనా కమ్యూనిస్టు నాయకుడు మావో నిర్వచనం. అయినా ఈ సగం మరో సగమైన పురుషులతో సమానంగా గాక కొంచెం తక్కువగా సమాజంలో చూడబడడం ప్రపంచవ్యాప్తంగా కనిపించే వాస్తవం. అభివృద్ధి చెందిన, చెందుతున్న చెందని దేశాలన్నిటా ఈ స్థితి కనిపిస్తున్నది. ఈ అన్యాయాన్ని తెలుగు నేల మీద నుండి ప్రశ్నించారు విజయలక్ష్మి. ఒకనాడు ఈ స్త్రీలను అసలు బడికి పంపేవాళ్ళే కాదు. తర్వాత ప్రాథమిక పాఠశాల దాకా పంపించి మాన్పించేసేవాళ్ళు. ఇప్పుడు ఈ స్థితిలాగా మారింది. అయినా విద్యలో స్త్రీ వివక్షకు గురికావడం పూర్తిగా సమసిపోలేదు. అది తీరని కోరిక అన్నారు కవయిత్రి. ఆటలలో సైతం స్త్రీ పురుష విభజన, వివక్ష ఉండటాన్ని గూడా ఈమె గుర్తించారు. ఆడపిల్ల మనిషికాదా? అన్నది ఈమె ప్రశ్న. భారతదేశంలో వివాహ వ్యవస్థను గురించి గురజాడ నుండి నేటిదాకా చర్చ జరుగుతూనే ఉంది. కన్యాశుల్క వివాహ నిరసన నుండి వివాహరహిత సహజీవనందాకా ఎంతో విచికిత్స జరిగింది. వివాహం విషయంలో "వలనపక్షీ నేనూ ఒకటే"నని విజయలక్ష్మి లక్ష్య అనే పాత్ర ద్వారా స్పష్టం చేశారు. ఒకనాటి బాల్య వివాహాన్ని నిరసిస్తూ వేటగాడి వలలో చిక్కిన అమాయక పక్షిగా స్త్రీని నిర్వచించారు. పుట్టిన ఆడబిడ్డను చెత్తకుప్పల్లో పారేయడం, ప్రకృతికి విరుద్ధంగా స్త్రీలను ఇంటికి పరిమితం చేయడం వంటివన్నీ విజయలక్ష్మి విమర్శకు గురయ్యాయి. బాల్యంలో తన ప్రమేయం లేకుండానే అఘాయిత్యానికి గురైన చిన్నపాపను తల్లిదండ్రులే ఈసడించుకోవడమూ ఈమె విమర్శకు గురైంది. ప్రేమ పేరుతో అమ్మాయిల మీద దాడిచేసే మృగాళ్ళను ఈమె కూడా వదిలిపెట్టలేదు. దీనిని ఉన్మాద, మనడమే సరైన నిర్వచనం. ప్రేమ అంటే దాడికాదని, అది త్యాగం, క్షమ, దివ్యానుభూతి అని నిర్వచించారు. ఇందుకే విజయలక్ష్మి స్త్రీని స్త్రీగా కాక మనిషిగా గుర్తించమని ప్రతిపాదించారు. 'నేనూ మనిషినే' అన్నారు. పురుషాధిక్యసమాజంలో అడుగడుగునా వివక్షల్ని అసమానతను అనుభవిస్తున్న స్త్రీ సమస్యలకుస్త్రీలే పరిష్కరించు కోవాలనే కవయిత్రి చేసిన ప్రబోధం. మొగవాడితో సమానస్థానం స్త్రీల జన్మహక్కుని చాటారు.

> ఆడపిల్లల్ని పారేయడం మొదలు కన్న తండ్రే కూతురిని నాశనం చేసే దుర్మార్గం దాకా ఆమె నిరసన విజృంభించింది. స్త్రీని బడికి పంపడం దగ్గర మొదలయిన వివక్షను ప్రశ్నించడంతో ప్రారంభమై స్త్రీ లేకుంటే మానవజాతి మనుగడ ఏమిటి? అని నిలదీసేదాకా పాకింది. విజయలక్ష్మి కవితలలో సగటు స్త్రీలతోపాటు చేనేత స్త్రీలు, జోగినులు కూడా కనిపిస్తారు.

భూమిని 'నేలతల్లి' అని నోరారా కీర్తిస్తుంది భారతదేశం. అయితే మానవతల్లి లాగే నేలతల్లి కూడా ఇవాళ చాలా అవస్థల పాలవుతున్నది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల దుర్మార్గాల వల్ల భూమి అంగడిసరుకై దుర్వినియోగమై ప్రకృతి సమతుల్యత దెబ్బతింటున్నది. పర్యావరణకాలుష్యం పెట్టుబడిదారుల పుణ్యం. దాని విష ఫలితాలు అనుభవించేది మాత్రం పేద దేశాలు, పేద ప్రజలు. ఇటీవల ప్రపంచీకరణ భారతదేశంపై బడి తిండిగింజలు

పండించే భూమి, ఊట కాలువలు మొదలు పెద్ద నదులు దాకా, ఊరిచెట్లు మొదలుకుని మహారణ్యాలదాకా అదృశ్యమై పోతున్నాయి. కాంక్రీటు భవనాల నిలయాలౌతున్నాయి. మాయగాళ్ళ మోసాలకు అంతులేకుండా ఉంది. దీని కంతటికీ పాలకుల అండ. 'ధరిత్రీవిలాపం'లో విజయలక్ష్మి పెట్టుబడిదారీ అభివృద్ధి నమూనా వల్ల ఏర్పడుతున్న పర్యావరణ విధ్వంసాన్ని ఒక కావ్యం నిండా అధిక్షేపించారు. భూమిని భూమిగా ఉంచుకోలేకపోవడం వల్ల ఆహార కొరత ఒక వైపు, భూమిని అవసరానికి మించి ఉపయోగించడం వల్ల భూకంపాలు, తుఫానులు ఏర్పడడం, పరిశ్రమల కాలుష్యం వల్ల వింతజబ్బులు వస్తున్నాయి. ఓజోను పొర విధ్వంసం ఇవాళ పెద్ద సమస్య. ఇవన్నీ ఎత్తి చూపిన కవయిత్రి, 'కాలుష్య భూతానికి కళ్ళెం వేయమని ప్రబోధించారు. భూమిని సరిగా వినియోగించుకోకపోవడం వల్ల కలిగే సకల అనర్థాలను ఈ కావ్యంలో కవిత్వమయం చేశారు విజయలక్ష్మి. ఈ కావ్యాన్ని పాలకులు, పెట్టుబడిదారులు చదవాలి.

ఏనాడు బౌద్ధం దేశం వదిలివెళ్ళిందో అనాడే భారతదేశం ఆత్మహత్య చేసుకుంది అన్నారు నూరేళ్ళ క్రితం గురజాడ. మానవ మతం అదృశ్యమై, విగ్రహాల మతాలు నిలదొక్కుకోవడం వల్ల భారతదేశం చాలా నష్టపోయింది. శాంతిని బోధించిన మతం పోయి విద్వేషాన్ని కలిగించే మతాలు నిలబడడం వల్ల భారతదేశం మతాల మారణకాండకు వేదిక అయ్యింది. కరుణను బోధించిన బౌద్ధం పైన విజయలక్ష్మికి గౌరవం ఉంది. కారణం అది దైవ మతం కాకపోవడం. మానవమతం కావడమే. విజయలక్ష్మికి దైవధ్యాస ఉన్నా, ఆమె బౌద్ధ ధర్మాన్ని గౌరవించారు. ఆధ్యాత్మికత జీవన కళ కావాలంటూ, దానినే సమస్యలకు ఆమె పరిష్కారంగా భావించారు. దాని ద్వారా మానవత్వం సిద్ధిస్తుందని భావించారు. ఈ ప్రేమతత్వాన్ని ప్రతి మనిషీ అలవరచుకోవాలని ఈమె అభిలషించారు. ఆర్థిక అసమానతల్ని గర్తించడానికి ఆమెకు భావవాదం అడ్డురాలేదు.

> ప్రపంచం మారాలంటే, విజయలక్ష్మి పేర్కొన్న సమస్యలన్నీ పరిష్కారం కావాలంటే మనిషికి అగ్రస్థానం ఇవ్వాలి. కవి మతంలోంచి బయటపడాలి.

బౌద్ధాన్ని, హిందూ సంస్కర్తల ప్రబోధాల్ని జీర్ణించుకున్నారు గనుకనే విజయలక్ష్మి చివరికి 'విశ్వపుత్రిక' అని కలంపేరు పెట్టుకొనే దశకు చేరారు. నేను విశ్వ పుత్రికనని, విశ్వశాంతి నా ఆకాంక్ష అని చాటుకునే దాకా ఎదిగారు. ఇందులో కొంత హిందూ భావజాలం మరికొంత భావవాద ఆధ్యాత్మిక చింతన ఉన్నా విశ్వశాంతి అనే ఉన్నత లక్ష్యం అందర్నీ ఆలోచింపజేస్తుంది. "విశ్వపుత్రికను నేను" అనే కావ్యంలో విజయలక్ష్మి ప్రపంచ మతాలనన్నిటినీ ఆహ్వానించారు. 'మానవత్వమే అసలు మతం అని భావించారు. నిజానికి మానవత అనేది దైవాన్ని తిరస్కరించేభావన. కాని కాలక్రమంలో భగవంతుని విశ్వసిస్తూ మంచి మనిషిగా ఎదగడమే మానవత్వంగా రూపొందింది. విజయలక్ష్మికి కూడా ఇదే అభిప్రాయముంది. నిజానికి ఇది సరైనది కాదు. మనిషా? దైవమా? ఏదో ఒకటి నిజమని తేల్చుకోవాల్సి ఉంది.

కవిత్వం రాయడం బిడ్డను ప్రసవించడం వంటిదేనని విజయలక్ష్మి బాగా చెప్పారు. "కవితాశక్తి పదే పదే నన్ను తట్టి లేపుతుంది! అందువల్లనే ఆమె ఇన్ని కావ్యాలు రాయగలిగారు. విజయలక్ష్మి కవిత్వంలో వస్తుబలం పుష్కలంగా ఉంది. అందమైన వచనం ఉంది. సమస్యల్ని గుర్తించడంతో ఆమె వెనకబడలేదు. అయితే వాటికి పరిష్కారాల విషయంలో ఆమె ఇంకా ఒక సందిగ్ధంలో ఉంటున్నారు. 'మానవత్వం' పరిష్కారం అయితే దానంతట అది ప్రజలకు అలవడదు. ప్రవచనాల వల్ల మారేది కొందరు. ప్రపంచంలో మమేకం కావడం ద్వారానే మానవత్వం బలపడుతుంది. మతాన్ని వదిలించుకోకుండా మానవత్వం అలవడదు. మానవత్వం భౌతిక భావన, భావవాద భావన కాదు. విజయలక్ష్మి దానిని తెలుసుకోవలసి ఉంది. అన్ని మతాలు మంచినే బోధిస్తూ ఉంటే ప్రపంచమేందుకు అగ్నిగుండంగా ఉంది? అందువల్ల మతం ద్వారా మానవత్వం సాధించడం అసాధ్యం. బౌద్ధం మీద విశ్వాసం ఉన్న విజయలక్ష్మి మిగతా మతాల జోలికి వెళ్ళకుండా ఉండవలసింది. ప్రపంచం చెడిపోతూ ఉందే అనే బాధ ఆమెలో హృదయదఘ్నంగా ఉంది. అందుకు బాధ్యులైన వాళ్ళంతా మత విశ్వాసులే. ప్రపంచం మారాలంటే, విజయలక్ష్మి పేర్కొన్న సమస్యలన్నీ పరిష్కారం కావాలంటే మనిషిని అగ్రస్థానం ఇవ్వాలి. కవి మతంలోంచి బయటపడాలి.

వస్తువు ఎంత బలంగా ఉంటుందో దానిని అభివ్యక్తం చేసే రూపం కూడా అంత బలంగా ఉండాలి. వస్తువుకు సృజనాత్మక అభివ్యక్తే కదా కవిత్వం. సాహిత్యం చెబుతున్న భావాన్ని కవిత్వభాషలోకి తర్జుమా చెయ్యాలి. లేకుంటే వచనమై తేలిపోతుంది. ఆగ్రహమైనా, ఆవేదన అయినా అనురాగమైనా, అభిమానమైనా శిల్పపు కొలిమిలో కాగి బయటకు రావాలి. విజయలక్ష్మి ఈ విషయంలో ఇంకా సాధన చేయాల్సిఉంది.

కులాలు, మతాలు నిస్సిగ్గుగా వీరవిహారం చేస్తున్న వర్తమాన భారతదేశంలో ఒక కవయిత్రి 'విశ్వ పుత్రికను నేను' అనడం ఒక ఛాలెంజ్.

"ఉర్వివారికల్లనొక్క కంచము బెట్టి" అన్నాడు వేమన. "ఎల్లలోకము ఒక్క యిల్లై" పోవాలన్నారు గురజాడ. "కోటానుకోట్ల నర లోకమేటి జగన్మాతృసుతుల" అన్నారు జాషువ. "విశ్వ కుటుంబ! ఏకరక్త బంధూ" అన్నాడు శ్రీశ్రీ విజయలక్ష్మి ఆ వరుసలో నిలబడినందుకు అభినందనలు. అయితే ఆమె విశ్వ పుత్రిక కావడానికి అడ్డంకిగా ఉన్న సకల భావవాద ధోరణుల నుండి ఆమె బయట పడినప్పుడే అది సాధ్యమౌతుంది.

"మనమందరం ఒకే చెట్టు పువ్వులం / ఒకే తల్లి బిడ్డలం"
– పి.విజయలక్ష్మి పండిట్

## నానీలు

- యస్సార్ పృథ్వి
9989223245



మహా ప్రస్థానం
ఒక అగ్నిశిఖ
చదవండి
తెలుస్తుందిక

నక్షత్రాలు
అదిరి చూశాయి
అవును
అక్షరాలా మజాకా!

ద్రోణుడికి
ఒక్కడే ఏకలవ్యుడు
శ్రీశ్రీకి
వందలు, వేలు

పేదల పీడలు
ధనస్వాముల క్రీడలు
ఆటమైదానంలో
అన్యాయాల జాడలు

వ్యంగ్యరసం
పొంగే సెలయేరు
మెదడు తలుపు తెరిస్తే
జడ భరతుడు

చైత్రం వచ్చింది
ఉగాదయింది
కోకిల గానం లేదు!
ఆశల పల్లకీ లేదు!!

బాల్యపు ఊహలు
శైశవ గీతం
బాల బానిసలు
నేటి వాస్తవం

కవిత్వమంతా
కొటేషన్ల గని
దేనిని
వదిలేస్తావని!

## హైకూలు

- జడపల్లె మాధవాస్సుధ
94929 35005



ఆశ్చర్యం
కాగితాలన్నీ తెలుపే
అక్షరాల వాసన అస్సలు పడదంట

ఆకాశమూ
అడుగుతోందంట
వానరేటు నింగినంటిందని

బంధాలు, బంధుత్వాలు
చివరిమెట్టుకు
డబ్బు గొలుసు జబ్బులు చరుస్తోం

నేటి
మహిళ
'కన్నీ'టి చెలమతో చెలిమి

అడవి తల్లి
బావురుమంటోంది
చెట్టు వాసన కోసం

వృక్షాలను
అట్టే కొట్టెయ్యకు
పాడెకూ కష్టం

నేటి
వైద్యం
పణమే నారాయణోహరి

కలం
కత్తుల్ని ప్రసవిస్తోంది
కపోతాలు ఎగరాల్సిన సమయం

## పుస్తకం

- కృష్ణవేణి
9246678858

పుస్తకం
హస్తభూషణం
ఏకాంతంలో చక్కని సహవాసం,
ఒంటరితనంలో వెంటనంటే తోడు
విజ్ఞాన సముపార్జనలో
దారి చూపే గురువు
వేదనాభరిత తరుణంలో
ఓదార్చే తల్లి..
ఊసుపోని సమయంలో
ఊసులు చెప్పే నేస్తం



నిద్రరాని సమయాల్లో
విశ్వకథలు వినిపించే బామ్మ
పుస్తకం......
మస్తక సహజ సంభాషణం
సమస్తలోక పరివేక్షణం

నువ్వెవరో విప్పిచెప్పే
అశరీర వాణి
నీకేం కావాలో వివరించే
నీ లోపలి వెలుగు
నీ వ్యక్తిత్వాన్ని మూర్తికట్టే
సూక్ష్మదర్శిని
పుస్తకం
నిన్ను నీకే సరికొత్తగా
ఆవిష్కరించే
అద్భుత దర్పణం

కథ

# ఇది మరో దిద్దుబాటు




- జోగారావు గుండాన
9490185708

అటు గోపాలపట్నం రూట్ రిలే ఇంటర్ లాకింగ్ కేబిన్ భవనం... ఇటు పాత గోపాలపట్నం ఊరు మధ్యలో రెండింటినీ విడదీస్తూ చెన్నై హౌరాల వైపు వెళ్ళే మార్గానికి రెండు జతల రైలు పట్టాలు.

అక్కడ ప్రతీ రోజూ ఉదయం తొమ్మిది గంటలకు జరిగే దృశ్యం...

ఆర్ఆర్ఐ కేబిన్‌నుద్దేశించి ఓ పిచ్చివాడు చేతులూపుతూ సైగలు చేస్తూ గట్టిగా అరుస్తాడు. ఎవరూ స్పందించకపోతే ఓ నాలుగు రాళ్ళు రువ్వుతాడు.

ఈ లోగా వచ్చేపోయే రైళ్ళకు జెండా ఊపే టోకెన్ పోర్టర్ మేడదిగి పిచ్చివాడి చేతిలో ఓ పది రూపాయలు నోటు పెడతాడు. పిచ్చివాడు ఆ టోకెన్ పోర్టర్ని ఆర్ఆర్ఐ కేబిన్ భవనాన్ని తీక్షణంగా చూస్తాడు. మరోసారి ఆకాశం వైపు చూస్తాడు. ఆ పదినోటు చేతిలో పట్టుకుని వెనుతిరిగి వడివడిగా అడుగులేసుకుంటూ వెళ్ళిపోతాడు. ఇదీ పిచ్చోడి దినచర్య. పది రూపాయల నోటు ఎవరు పంపిస్తున్నదీ పాతగోపాలపట్నం వాసులు ఎంత అడిగినా టోకెన్ పోర్టర్ చెప్పడు. తన పని అయిపోయిందన్నట్టు ఆర్ఆర్ఐ కేబిన్లోకి నిశ్శబ్దంగా వెళ్లిపోతాడు.

కనకరాజు పేరుకు తగ్గట్టు కనకరాజే. విశాఖపట్నం దొండపర్తిలో ఉన్న డివిజనల్ రైల్వే మేనేజర్ ఆఫీసులో ప్యూనుగా పనిచేస్తున్నాడు . సంతానం ఒకే ఒక్క కూతురు పుష్ప. గారాబంగా చాలా ముద్దుగా పెంచుకున్నాడు. డి.ఆర్.ఎమ్ ఆఫీసుకు ఆనుకుని ఉన్న రైల్వే క్వార్టర్లోనే నివాసం. వందకు ఐదు రూపాయలు వడ్డీతో నలుగురికీ సాయంచేసే కనకరాజు కావాలనుకుంటే సొంతానికి ఇల్లు కట్టుకొని హాయిగా ఎక్కడైనా ఉండవచ్చు. అయితే ఆఫీసు రాకపోకలకు దగ్గరగా ఉంటుందని రైల్వే క్వార్టర్స్‌లోనే ఉంటున్నాడు.

గారాల పట్టి పుష్పకు ఇంట్లో ఆడిందే ఆట పాడిందేపాట బీఎస్సీ పాసయిన మరుక్షణం స్కూటీ కొనిచ్చాడు కనకరాజు. ఇక షికార్లే షికార్లు. డాబాగార్డెన్స్ మీదుగా అల్లిపురం సందులన్నీ పుష్పకు బాగా పరిచయమే. స్కూటీపై షికార్ల సమయంలోనే పవన్‌తో పరిచయమైంది. పవన్ స్కూటర్ మెకానిక్. పుష్ప బండి రిపేరుకొచ్చినపుడు ఓ అరడజను సార్లు సరిచేసాడు.

సన్నగా, పొడుగ్గా లేటెస్ట్ స్టైల్లో ఉండే పవన్ అంటే ఆకర్షణకులోనై ప్రేమలో పడింది పుష్ప. విషయం తెలిసిన కనకరాజు కూతురిపై కన్నెర్ర చేసి సరైన దారిలో తీసుకొచ్చే ప్రయత్నం చెయ్యకుండా బుజ్జగించి చెబితే, వినే స్టేజి పుష్ప ఎప్పుడో దాటిపోయింది. ధిక్కారం చేసి ఒకరోజు కనకరాజు బీరువాలో భద్రపరచిన సొమ్ముతో పవన్‌తో కలిసి చైన్నై మెయిల్లో పారిపోయింది.

డబ్బు సరదాలు షోకులతో ఆవిరైపోయిన తర్వాత ఓ రోజు తెల్లవారు జామున ఫలక్‌నామా ఎక్స్‌ప్రెస్‌లో విశాఖలో దిగి నేరుగా ఇంటికొచ్చింది. తల్లి ఇంటి ద్వారబంధం దగ్గర నిల్చోబెట్టి తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్ల దండకం అందుకుంటే ఆమె నోరు మూయించి కనకరాజు కూతుర్ని, పవన్‌ని ఇంట్లోకి రమ్మన్నాడు. ఉదయాన్నే ఇద్దర్నీ కనకమహాలక్ష్మి గుడికి తీసుకెళ్ళి అక్షతలు వేయించాడు. మూడు ముళ్ళతో పెళ్ళి చేయించి ఇంటికి తీసుకొచ్చాడు. పవన్ ఇప్పుడు ఇల్లరికం అల్లుడు. ఏ పని చేయకుండా మామగారి డబ్బుతో జల్సాగా హాయిగా జీవితం గడిపేస్తున్నాడు.

ఓ రోజు రాత్రి పదకొండు గంటల ప్రాంతంలో వడ్డీ డబ్బులు వసూలు చేసుకొని ఇంటికి చేరిన కనకరాజు గుండె పట్టుకుని కూలబడిపోయాడు. విపరీతమైన గుండెనొప్పి. హార్ట్‌అటాక్!... ప్రక్కనే ఉన్న రైల్వే ఆసుపత్రికి తరలించేలోపు కనకరాజు ఊపిరి ఆగిపోయింది. ఈ హఠాత్ పరిణామానికి కనకరాజు భార్య మంగమ్మ తలబాదుకుంది. బంగారం లాంటి భర్త నిముషాల్లో కట్టెగా మారిపోవడంతో ఆమె వెక్కి వెక్కి ఏడ్చింది.



మరణానంతరం జరగాల్సిన పనులు ఇరుగూ,పొరుగూ బంధువుల సహకారంతో పూర్తయ్యాయి. కనకరాజు చనిపోయిన తర్వాత రైల్వే నుండి రావాల్సిన సొమ్ము రాబట్టుకోవడానికి తల్లిని తీసుకుని పుష్ప ఆఫీసు చుట్టూ ఓపిగ్గా తిరిగి పనులు చేయించుకుంటోంది. యూనియన్ నాయకులు ఉద్యోగ నిమిత్తం పుష్పతల్లిని దరఖాస్తు పెట్టుకోమని సూచించారు. అమ్మ మానసిక పరిస్థితి ఏం బాగాలేదని, కొద్ది రోజుల తర్వాత మనసు కుదుట పడితే కారుణ్య నియామకం క్రింద ఉద్యోగ విషయమై ఆలోచిస్తామని చెప్పింది.

రోజులు గడుస్తున్నాయి. హఠాత్తుగా మామ కనకరాజు చనిపోవడంతో వచ్చిన డబ్బుతో పవన్ కోరికలు గుర్రాలయ్యాయి. త్రాగుడుకు బాగా అలవాటుపడి పగలూ రాత్రీ మందు మత్తులో మునిగి తేలుతున్నాడు. చీటికి మాటికీ పుష్పను డబ్బు కోసం వేధించడం మొదలుపెట్టాడు. తాగి తందనాలాడుతూ రోడ్లపై ఎక్కడి కక్కడ పడిపోతున్నట్టు కబుర్లు పుష్ప వరకూ వస్తున్నాయి.

ఇటు గారాబంగా పెంచిన తండ్రి పోయిన దుఃఖంతో ఉన్న పుష్పకు భర్త పవన్ నడవడి తలనొప్పిగా తయారైంది. ఎంతో బోధపరచి చెప్పింది. పరిస్థితిని అర్థం చేసుకోమని చేతులెత్తి నమస్కరించింది. ఈ కష్టకాలంలో తనతో సహకరించమని కాళ్లు పట్టుకుని బతిమిలాడింది... ప్చ్.. ఫలితం శూన్యం.

రాత్రి పూటుగా తాగి ఇంటికొచ్చి గుర్రుపెట్టి నిద్రపోయిన భర్త పవన్, నిద్ర లేచిన తర్వాత "టీ" అందిస్తూ అంది పుష్ప.... "ఏమండి, ఒక విషయంలో మీరు నాతో సహకరిస్తే మనం జీవితాంతం ఎటువంటి చీకూ చింతా లేకుండా హాయిగా ఉండొచ్చు."

"ఏంటది?"

"మనం విడాకులు తీసుకోవాలి"

"ఏమిటీ.. విడాకులా?"

"అవునండి, అదీ తాత్కాలికమే.. విడాకులు తీసుకున్న పత్రాలు ఆఫీసులో జమ చేస్తే మా నాన్నగారి ఉద్యోగం నాకు లభిస్తుంది. ఇందుకు మా అమ్మ దగ్గర్నుండి అంగీకారపత్రం తీసుకుంటాను. ఉద్యోగం వచ్చిన తర్వాత మళ్ళీ మనం గుప్తంగా భార్యభర్తలుగా జీవించవచ్చు."

"ఇదేదో బాగానే ఉందే..."

"అవునండీ, నెలనెలా జీతం... హాయిగా సాఫీగా మనకంటూ ఓ చిన్న కుటుంబం... పిల్లా పాపా"

"ఇందుకు నేనేం చెయ్యాలి"

"ఓ సంవత్సర కాలం మీరు మీ తల్లిదండ్రుల దగ్గరకు వెళ్ళిపోండి... అవసరమైనప్పుడు రాత్రివేళ ఇంటికి వచ్చి కావల్సిన డబ్బులు తీసుకెళ్తూ ఉండండి."

"ఓకే"

పవన్‌తో కలిసి పుష్ప లాయర్ని కలిసింది. విడాకుల పత్రాలు తయారు చెయ్యమని కోరింది. విడాకుల పత్రాలు తయారీలో పవన్ అవసరమైన చోట సంతకాలు పెట్టాడు.

పరస్పర అంగీకారంతో పవన్ పుష్పలు, భార్య భర్తల బంధం నుండి విడిపోయినట్టు ఓ ఆరు నెలల అనంతరం పత్రాలు కోర్టు నుండి జారీ అయ్యాయి.

కనకరాజు భార్య మంగమ్మ రైల్వే ఆఫీసులో పెట్టుకున్న దరఖాస్తులో తన భర్త ఉద్యోగం కూతురు పుష్పకు ఇప్పించమని కోరింది. విడాకుల అనంతరం కూతురు పుష్ప తన దగ్గరే ఉంటున్నదనీ, తనకు ఏకైక దిక్కూ ఆధారం కూతురు పుష్ప అని దరఖాస్తులో పేర్కొంది.

రైల్వే ఆఫీసు నుండి పుష్పకు కబురొచ్చింది. విద్యార్హతల పరిశీలనాంతరం డిగ్రీ పాస్ అయివున్న పుష్పకు "క్లాస్ త్రీ' కేటగిరిలో జాబ్ వచ్చే అవకాశాలున్నాయి. అయితే పుష్ప ఈ విషయంలో రైల్వే యూనియన్ నాయకుల్ని కలిసింది. వారి సహకారంతో డిపార్ట్‌మెంట్ కోటాలో ట్రైనీ అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్ పోస్టుకు ఎంపికైంది.

మూడు నెలల శిక్షణా కాలంలో ఇటు డిపార్ట్‌మెంట్‌లో అభ్యర్థులే కాక అటు డైరెక్ట్ రిక్రూట్ అభ్యర్థులు కూడా కలసి బ్యాచ్‌గా ఏర్పడతారు. బీహార్లో చక్రధర్‌పూర్ ట్రైనింగ్ స్కూల్లో జరిగే శిక్షణ ఆసక్తిదాయంగా సాగుతుంది. ఈ శిక్షణ కాలంలో డైరెక్ట్ రిక్రూట్ అయిన లక్షణమైన కుర్రాడు అన్వేష్‌తో పుష్పకు పరిచయం ఏర్పడింది.

శిక్షణా కాలం పూర్తయి తర్వాత డిపార్ట్‌మెంట్ అభ్యర్థులకు వాల్తేరు విభాగంలోనే పోస్టింగ్ ఇస్తారు. డైరెక్ట్ రిక్రూట్, అన్వేష్ పోస్టింగ్ కూడా వాల్తేరు విభాగంలో ఖాళీలు ఉండటంతో కలిసి వచ్చింది. పుష్ప వాల్తేరు 'ఎఫ్ కేబిన్లో డ్యూటీ చేస్తే అన్వేష్ 'బి' కేబిన్లో.... రెండు కేబిన్లూ ప్రక్కనే ఉండడంతో ఇక కబుర్లు దొంతరలుగా దొర్లడంతో ఆశ్చర్యమేముంది?.......

ఒక నెట్ వర్క్ సెల్‌ఫోన్‌లో కల సౌలభ్యాన్ని వాడుకుంటూ అన్వేస్ పుష్పలు సుదీర్ఘంగా ముచ్చట్లాడుకుంటున్నారు.

పవన్ పుష్పను కలవడానికి ప్రయత్నిస్తే, "ఎవరైనా చూస్తే ఆఫీసు వరకూ వెళ్తుందని... తన ఉద్యోగానికే ముప్పు అని, ఫోన్లో తప్ప పర్సనల్‌గా కలవడానికి ప్రయత్నించ వద్దని" ఖరాఖండిగా చెప్పింది పుష్ప.

ఓ శుభముహూర్తంలో అన్వేష్ పుష్పలు రిజిష్టర్ మ్యారేజ్‌తో ఒక్కటయ్యారు.

విషయం తెలుసుకున్న పవన్ మోసపోయానని జుత్తు పీక్కున్నాడు. కనిపించే ప్రతీ ఒక్కరికి తన కథ చెబుతున్నాడు. ఓసారి దారి కాసి పుష్పని అడ్డుకుని మాట్లాడబోయాడు. పుష్ప అరిచి కేకేలేసి నానా రభస చేసింది. మరోసారి నన్ను ఇబ్బంది పెట్టినట్లయితే పోలీసు కంప్లైంట్ ఇస్తానని బెదిరించింది. విడాకులు తర్వాత నువ్వెవరో నాకు తెలియదని చెప్పింది. అవాక్కయిన పవన్ పూర్తిగా పిచ్చివాడిగా మారిపోయాడు. పుష్ప బదిలీపై గోపాలపట్నం ఆర్ఆర్ఐ కేబిన్లో పనిచేస్తుందని తెలిసీ రోజు ఉదయం పవన్ అక్కడికి వస్తాడు. కేబిన్నుద్దేశించి ఏదో అంటాడు. సైగలు చేస్తాడు. పదినోటు చేతికందిన తర్వాత నిశ్శబ్దంగా తిరిగి వెళ్ళిపోతాడు...

ఉత్సుకతని ఆపుకోలేని ఎవరైనా పుష్పను 'ఎవరమ్మా అతను?' అని అడిగితే 'మా నాన్న డెప్యూటేషన్‌పై విజిలెన్స్ వాచర్‌గా పనిచేసే రోజుల్లో 'కమర్షియల్ క్లర్క్'గా ఈ వ్యక్తి బాగా నొక్కేసేవాడు. ఒక ట్రాప్ కేసులో చిక్కుకుని మా నాన్న ఇచ్చిన సాక్ష్యంతో ఉద్యోగాన్ని పోగొట్టుకున్నాడు. మానాన్న బతికి ఉన్నప్పుడు అతన్ని వేధించేవాడు. ఇప్పుడు నన్ను ఇలా సాధిస్తున్నాడు" అని వివరణ ఇస్తోంది.

మహాకవి కథకుడు శ్రీ గురజాడ వేశ్యావ్యామోహాల నేపథ్యంలో రాసిన కథ 'దిద్దుబాటు'లా ఇందులో పుష్ప 'జారిణి' కాదు దిగజారిపోయిన తన వైవాహిక జీవితాన్ని సరిదిద్దుకోడానికి ఒక ప్రయత్నం చేసింది ఇకపోతే అన్వేష్‌పై ఆమెకు పీకల్లోతు వ్యామోహం లేదు. అయితే పైసా రాబడిలేకపోయినా తాగుబోతుగా మారి నరం చూపిస్తోన్న పవన్ నుండి విముక్తిపొంది, వచ్చిన అవకాశంతో సుస్థిర భవిష్యత్తుకూ ప్రశాంత జీవనానికీ తలుపులు తెరచింది.

ఒక్క వాక్యంలో.. పుష్ప తన జీవితాన్ని సరిదిద్దుకుంది ఇది మరో దిద్దుబాటు !

*(వాస్తవ ఘటనకు గమనానుగుణంగా కథనం)*

# మునిపల్లెరాజు కథలలో స్త్రీ పాత్రలు - మాతృహృదయావిష్కరణ



మునిపల్లె రాజు సృష్టించిన స్త్రీ పాత్రలలో ప్రధానంగా అన్ని సామాజిక వర్గాలకు చెందిన పాత్రలు కన్పిస్తాయి. ముఖ్యంగా సమాజం చేత వెలివేయబడ్డ పాత్రలుగా, అందరి చేత ఛీత్కారాలు ఎదుర్కోన్న స్త్రీ మూర్తులుగా కనిపించిన వేశ్యపాత్రలను తన కథలలో ఉదాత్తంగా, ఆదర్శవంతంగా తీర్చిదిద్దారు.

- ఇ. వేదవతి
9059278598

కథకుడిగా ఎన్నో మంచి కథలను అందించి సాహిత్యంలో తనకంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకున్న రచయిత మునిపల్లె రాజు. వీరు 1926 మార్చి 16న గుంటూరు జిల్లా బాపట్ల తాలుకా గరికపాడు గ్రామంలో జన్మించారు. వృత్తిరీత్య సైనిక పటాలంలో పనిచేసిన వారు ప్రవృత్తిరీత్యా సాహిత్యాభిలాషను కొనసాగించారు. తన వ్యక్తిగత, ఉద్యోగ జీవితంలో అనుభవించిన, కష్టాలను, చూసిన యదార్థ సంఘటనలను తన కథలలో చిత్రించారు. 4 కథా సంపుటాలను రెండు కవితాసంపుటాలను, రెండు సాహిత్యవ్యాసాల సమీక్ష గ్రంథాలను ప్రచురించారు.

ప్రేమ, ద్వేషం దాంపత్యం, కుటుంబ విలువలు, సామాజిక జీవనం - స్త్రీ జీవన చిత్రణ ఇలా భిన్న కోణాలు కథలలో మనకు కనిపిస్తాయి. మునిపల్లె రాజు తన కథలలో స్త్రీ పాత్రలను ఎంతో ఉదాత్తంగానూ ఆదర్శవంతంగా తీర్చిదిద్దారు. ఆర్థిక, సామాజిక, రాజకీయ, పరిస్థితులు వాటి కనుగుణంగా పాత్రల చిత్రణ వీరి కథలలో మనకు తరచు కన్పిస్తాయి. స్త్రీ పాత్రలు ఎంత ఉదాత్తంగా తీర్చిదిద్దారో మాతృహృదయాన్ని కూడా అంతే ఉదాత్తంగా తీర్చిదిద్దారు. తమ బిడ్డల ఉన్నతికి తమ జీవితాన్ని త్యాగం చేసిన మాతృమూర్తులు అనేకం వీరి కథలో కన్పిస్తారు. వాటిలో కొన్ని పాత్రలను పరిశీలిద్దాం.

మునిపల్లె రాజు సృష్టించిన స్త్రీ పాత్రలలో ప్రధానంగా అన్ని సామాజిక వర్గాలకు చెందిన పాత్రలు కన్పిస్తాయి. ముఖ్యంగా సమాజం చేత వెలివేయబడ్డ పాత్రలుగా, అందరి చేత ఛీత్కారాలు ఎదుర్కోన్న స్త్రీ మూర్తులుగా కనిపించిన వేశ్యపాత్రలను తన కథలలో ఉదాత్తంగా, ఆదర్శవంతంగా తీర్చిదిద్దారు.

అటువంటి పాత్రలలో ప్రధానమైనవి. యశోద కొడుకు కథలో యశోద, భోగంమనిషి' కథలో యశోద పాత్ర, రాగమ్ నీలాంబరి'8 కథలో హనుమాయి పాత్ర, సమాజంలో ఈ పాత్రలు వెలివేయబడ్డ పాత్రలుగా కనిపించిన వారిఉదాత్తమైన వ్యక్తిత్వ చిత్రణ ఆ పాత్రలపైనే గౌరవాన్ని కలిగిస్తాయి.

సంఘ:లో గౌరవంలేని కులంలో పుట్టింది యశోద. వృత్తికి భిన్నమైన ప్రవృత్తి కలది. ఆత్మగౌరవం కలిగిన అమ్మాయి, సంఘంలో కట్టుబాట్లకు బలై ఇష్టపడ్డ సదాశివాన్ని చేసుకోలేకపోయింది. భోగంది భోగం మనిషి కాక మరేమవుతుంది. అనే సమాజపు తీరును ఆమె స్పష్టం చేసింది. వివాహానంతరం తన స్థితిగతులలో వచ్చిన మార్పులను అనుసరించి ఆమె తీసుకున్న నిర్ణయం, ఆత్మగౌరవాన్ని మంటగలుపుతున్న సమాజంపై ఆమెకున్న నిరసన భావం తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోవడానికి చేసిన ప్రయత్నం చాలా ఉన్నతమైనది. సమాజంలో వేశ్యలుగా, ఉంపుడుగత్తెలుగా

ముద్రవేయబడ్డా అంతర్గతంగా వారిలోని మాతృహృదయాన్ని, ఆదర్శవంతమైన వక్తిత్వాన్ని తన కథలో చూపించారు.


మునిపల్లెరాజు

విశాఖ కనక మహాలక్ష్మి కథలో మల్లీశ్వరి పాత్ర కూడా ప్రధానంగానే కన్పిస్తుంది. సమాజంలో స్త్రీ ఒంటరిగా జీవించడం కష్టం. సమాజం నుండి స్త్రీ రక్షించబడాలంటే ఎవరో ఒకరి తోడు నీడ అవసరం. అందుకే ఈ కథలో మల్లీశ్వరి తనను తాను రక్షించుకోవడానికి చిల్లరవాడైన రమణను చేరదీసింది. కాని తన ఆత్మగౌరవం కోసం, జీవన భృతి కోసం సంఘంలో కట్టుబాట్లకు అవినీతికి బలికాకుండా ఉండేందుకు తనకు తాను ప్రత్యేక స్థితిని ఏర్పాటు చేసుకున్న వ్యక్తిత్వం గల ఉత్తమ మహిళగా మల్లీశ్వరి పాత్ర తీర్చిదిద్దబడింది. అలాగే వీరి కథలలో స్త్రీ మూర్తులు, మాతృహృదయం ఏ విధంగా ఆవిష్కరించబడిందో ఈ క్రింది కథలలోని పాత్రలను చూస్తే అర్థమవుతుంది. తల్లిప్రేమలో నిస్వార్థం, త్యాగం తప్ప మరేది ఆశించని గొప్ప గుణం ఈ కథలలో మనకు కన్పిస్తుంది. అటువంటి పాత్రలే వారి మాతృదర్శనమ్. కొత్త ప్రమిదలో చిన్న దీపం. ఆమె పేరు అమ్మి తదితర కథలలో కన్పిస్తాయి.

*తన కొడుకు దేశం కోసం త్యాగం చేయడానికి సిద్ధపడ్డాడని తెలుసుకుని మనస్థైర్యాన్ని కూడగట్టుకుంది. కాని తిరిగి వచ్చిన కొడుకుని చూసి దైవాన్ని కూడా మర్చిపోయింది. తన ప్రాణం కంటే తన బిడ్డ ప్రాణమే ముఖ్యమనుకుంది. స్త్రీలోని సహజమైన ప్రేమను, తల్లి మనస్సును ఈ కథలో సహజంగా చిత్రించారు మునిపల్లెరాజు*

మాతృదర్శనమ్ కథలో శారదంబ భర్త, సుశీల చిన్నపిల్లగా ఉన్నపుడే సంసారాన్ని వదిలి సన్యాసుల్లో కలిసిపోతాడు. అప్పటినుండి ఒకవైపు ఆస్తిని, మరోవైపు కూతురిని రక్షిస్తూ సుశీలను ఉన్నత స్థితికి చేర్చడానికి ఆమె పడిన వేదన, తపన మనకర్థమవుతుంది. ఈ కథలోనే మరొకపాత్ర శ్రీనివాసశర్మ ఇతని తండ్రి చిన్నతనంలోనే మరణించడం కుటుంబ భారం తల్లిమీద పడడం, చివరకు ఇళ్ళలో పాచిపని చేసి కొడుకుని చదివించి అభివృద్ధిలోకి తెస్తుంది. ఈ కథలో రెండు వేర్వేరు పరిస్థితులలో భర్తకు దూరమై, ఒక వైపు పిల్లల సంరక్షణ మరొకవైపు కుటుంబ పోషణ - వారి భవిష్యత్తును తీర్చిదిద్దాలనే ఆకాంక్ష ఆ తల్లులిద్దరిలో ఒకటే, మగవాడి అండ లేకుండా స్త్రీ ఒంటరిగా సమాజంలో కుటుంబ - పిల్లల సంరక్షణ చేయడం కష్టమే అయినా అన్నీ కష్టాలను ఇష్టాలుగా మార్చుకుని తమ పిల్లల భవిష్యత్తుకై నిరంతరం శ్రమించిన గొప్ప మాతృమూర్తులుగా రాజుగారు మాతృహృదయాన్ని ఆవిష్కరించారు.

'ఆమె పేరు' కథలో జానకమ్మ సాధారణ కుటుంబానికి చెందిన స్త్రీ భర్త మరణించాక ఆదరించే వాళ్ళు లేక ముగ్గురు పిల్లల పైనే తన ఆశలు నింపుకుని వారి ఉన్నతికై పాటు పడింది. తన పెద్ద కొడుకు చేతికి అందివచ్చి కష్టాలు తీరుస్తాడని ఆశపడింది. కాని ఆ పెద్దవాడు లోకంలోని తల్లుల కష్టాలను తీర్చడానికి పూనుకున్నాడు. ఇక రెండవ వాడు సన్యాసుల్లో కలిసిపోయి జానకమ్మ గుండెల్లో చిచ్చునురేపాడు. మూడోవాడే తన జీవితం అనుకుని ఇద్దరు కొడుకులు చేసిన గాయాన్ని మర్చిపోయింది. కాని తనకు ఆ వయస్సులో అండగా ఉండవలసిన కొడుకు విదేశాలకు బయలుదేరాడు. అతని కోసం ఎదురు చూస్తూ తన జీవితాన్ని ముగించింది. తల్లి తన పిల్లల సంరక్షణలోనే తన జీవితం ఆధారపడివుందని భావిస్తుంది. వారి ఉన్నతికై అనుక్షణం తపిస్తుంది. వారికోసం తన జీవితాన్ని త్యాగం చేయడానికి సిద్ధపడుతుంది. అటువంటి గొప్ప మాతృప్రేమను జానకమ్మలో చూపించారు. తన కొడుకులను ముగ్గురిని మూడు మాణిక్యాలుగా తీర్చిదిద్దడానికి తన జీవితాన్నంతా త్యాగం చేసిన అమ్మ చివరకు ఆ కొడుకులకై తపిస్తూ తుదిశ్వాస విడిచింది. ఆమె ప్రేమ విలువ కట్టలేనిది.

'కొత్త ప్రమిదలో చిన్న దీపం' కథలో కూడా తన కొడుకే తన జీవితమనుకున్న తల్లి పాత్ర. తనను కాదని తన కొడుకు ఏ నిర్ణయం తీసుకోడని భావించింది. కాని తన కొడుకు జనార్థనం పై చదువుకు కాశీకి వెళ్ళడానికి తన అనుమతి లేకుండా నిర్ణయం తీసుకున్నాడని తెలిసి తల్లి హృదయం తట్టుకోలేకపోయింది. తన కొడుకు దేశం కోసం త్యాగం చేయడానికి సిద్ధపడ్డాడని తెలుసుకుని మనస్థైర్యాన్ని కూడగట్టుకుంది. కాని తిరిగి వచ్చిన కొడుకుని చూసి దైవాన్ని కూడా మర్చిపోయింది. తన ప్రాణం కంటే తన బిడ్డ ప్రాణమే ముఖ్యమనుకుంది. స్త్రీలోని సహజమైన ప్రేమను, తల్లి మనస్సును ఈ కథలో సహజంగా చిత్రించారు రాజుగారు.

మానవుల్ని ఏ ఆశాజ్యోతి ఏ మమత చుట్టుకుని అన్ని నిరాశల్ని భయంకర సంకల్పాలను దూరంగా తరుముతుందో ఆ ఆవేశమే వచ్చింది ఆమెలో. ఎందుకంటే కొడుకు మరణంతో వ్యర్థమైందనుకున్న తన జీవితంలో కొత్త ఆశలు చిగురించాయి. జనార్థనం కొడుకుని చూశాక, కొడుకు మరణంతో క్రుంగిపోయిన ఆమెకు మనవడిరాక ఒక క్రొత్త ఆశను చిగురించేలా చేసింది. ఆమెలో మాతృహృదయం సాక్షాత్కరించింది. ఆ క్రొత్త రక్త సంబంధంలో తన కొడుకును

# రెక్కలు

- డా॥ పెళ్ళకూరు జయప్రద సోమిరెడ్డి
94402 79594



ఆశ పడిందల్లా
అందితే
మామిడి పండు
వగరు –

నిరీక్షణ
బహుతీపి!

వయసు
మైలురాయి
ఆఖరు మజిలీ
మృత్యువు –

అది
కాలనియతి !

కోట్ల కొరకు
పాట్లు
ఆనందం
నిల్–

ఎండమావుల
మిలమిల!

వెన్నెల సోనలను
ఆస్వాదించకుండా
స్పీడ్
బ్రేకర్ –

ఆశ
కురుపు!

కత్తికన్నా
ఎక్కువ
గాయాన్ని
చేయగలవు –

ఆటవిక
నైజం

పబ్‌లు
పానశాలలు
హై
కల్చర్ –

ల్యాబ్ రిపోర్టులోనే
రిజల్ట్!

మనం
ఎదగం
ఎదిగిన వాళ్ళను చూసి
కుళ్ళుకుంటాం –

ఈర్ష్య
దహించే జ్వాల!

కూతురు డాక్టర్
కొడుకు ఇంజనీర్
రిక్తహస్తాలతో
కన్నవాళ్ళు –

ఉట్టిపై
ఖాళీ దుత్త!

అదృష్టం
తలుపు తట్టేది
ఎప్పుడో
ఒక్కసారి –

మొద్దు నిద్ర
మంచిది కాదు!

నవ్వుల్ని
భద్రంగా దాచుకో
రేపు
పూస్తాయో లేదో –

ఊహకందనిది
కాలం!

చూసుకుంటూ తన పాత గాయాలను మర్చిపోవడానికి ఆ తల్లి పడిన ఆవేదన, ఆరాటం పాఠకులకి ఒక్కింత ఆవేదనను కలిగిస్తాయని చెప్పడంలో అతిశయోక్తి లేదు. అదే మాతృప్రేమలో గొప్పతనం.

కుటుంబ గౌరవం కథలో కూడా భాగ్యమ్మ మధ్య తరగతి స్త్రీ, భర్త మరణంతో పాటు ఆస్తిని కోల్పోయినా తన బిడ్డ అభివృద్ధిని సాధించాలనే ఆకాంక్ష ఆ తల్లిలో కన్పిస్తుంది. తల్లి పడే కష్టాలను తెలుసుకున్న విశ్వనారాయణ తమ నీడన బ్రతికిన కొండయ్యే తమ ఇంటిని వేలంలో కొన్నాడని, తన తల్లి కష్టాలను తీర్చి ఋణం తీర్చుకోవడానికి ఏ విధంగానైనా కొండయ్య నుండి ఇంటిని తిరిగి పొంది తల్లికి అందించాలని భావించాడు. కాని తల్లి మీద గౌరవంతో ఆమె ఒక్క మాటతో తానెంతో కష్టపడి కొండయ్య నుండి పొందిన ఇంటిని అతనికే తిరిగి ఇచ్చేస్తాడు. తాను కష్టపడ్డా కొడుకు సుఖపడాలని తల్లి భావించింది. తాను ఎంత కష్టపడైనా తన తల్లి కష్టాన్ని తీర్చాలనుకున్నాడు కొడుకు. తల్లి, కొడుకుల మధ్య ఉండే సున్నితమైన అనిర్వచనీయమైన అనన్య ప్రేమ, గౌరవానికి ఉదాహరణ ఈ కథ.

అలాగే తల్లి పిల్లల కోసం ఏ కష్టాన్నైనా భరిస్తుంది. ప్రాణమైనా చివరికి శీలాన్ని సైతం త్యాగం చేస్తుంది. అటువంటి మాతృహృదయం 'వీరులూ – వారసులూ కథలో తాయారమ్మ పాత్ర చిత్రించబడింది. పిల్లల ఆకలితో అలమటించి పోతున్నారని కనీసం వారికి గంజనీళ్ళు పోయాలని తాను గర్భవతినని పేరు నమోదు చేయించుకుని, గంజికేంద్రంలో వారి చేత చీత్కరింపబడి తిరిగి వస్తుంది.

చివరకు పిల్లల ఆకలిని తీర్చడానికి మరొక మార్గం లేక తన శీలాన్ని అమ్ముకుని వారికి కడుపునింపుతుంది ఆ తల్లి. మునిపల్లెరాజు కథలలోని ఇటువంటి పాత్రలు మాతృప్రేమకు, త్యాగానికి పరాకాష్ట. పిల్లల సుఖం కోసం వారి భవిష్యత్తు కోసం తల్లి ఎటువంటి త్యాగానికైనా సిద్ధపడుతుంది అని చెప్పడానికి ఒక మచ్చుతునక ఈ కథ. తల్లి ప్రేమకు సాటియైనది ఈ జగత్తులో ఏది లేదు. అటువంటి మాతృహృదయాన్ని విలువకట్టడం ఎవరికి సాధ్యం కాదు. అది అనన్య సామాన్యమైనది. అటువంటి స్త్రీ మూర్తులలో మాతృహృదయాన్ని హృదయానికి హత్తుకునేలా గొప్ప ఉదాత్తమైన, పాత్రలను మునిపల్లె రాజు తన కథలలో ఆవిష్కరించారు.

కవిత

# పసిగీతం

- రమణ వెలమకన్ని
98660 15040

ఆకాశం ధ్వనిస్తే చాలు
ఆ చిన్నారి పాదాలు పైపైకి
ఆ శబ్దాన్ని పట్టి క్రిందికి లాగుదామని...

సీతాకోక రెక్క పిడికిట్లో బిగుసుకుందో
సుతిమెత్తని అరచేతుల మర్దనే
ఆ రంగులన్నీ పులుముకుందామని

టీవీ ఛానళ్ళను
వేళ్ళతో పరుగులెత్తిస్తూ
"డిస్కవరీ"ని కళ్ళవాకిట్లో నిలబెడ్తాడు
ఒక్కో దృశ్యాన్ని మెదడు పొరల్లో పొరలిస్తూ..

గోడకు తలక్రిందులై జారిగిలపడతాడు
కాళ్ళు ఝాడించినప్పుడల్లా
అలలా భళ్ళున జారిపడుతూ
గాలిలో నడవాలని
తిరగబడి మళ్ళీ మళ్ళీ వేలాడుతూ....



వడగళ్ళను ఒడిసిపట్టి జేబులో కుక్కుతాడు
తడిమినప్పుడల్లా తడే తగులుతుంటే
యింతలోనే రాళ్ళు ఎలా మాయమో
నఖశిఖపర్యంతం పరీక్షిస్తూ...
నా కవిత్వాన్ని పొమ్మాడి
కేరింతలు కొడతాడు
శాలువా మడతల్లో పరవశిస్తూ
ఏదో అనుభూతి వాడి గుండెల్లోకి ప్రవహిస్తూ...

నా మనుమడు అని కాదు
ప్రపంచపు పసితనాల ఆరాటపోరాటం అది
ఎందరు అబ్దుల్‌కలామ్‌లో.. ఎందరెందరు ఐన్‌స్టీన్‌లో..
పరుగులిడుతున్న కాలాన్ని
పెనవేసుకుంటున్న భావితరాలు
అభ్యుదయ బాట దివిటీలు
కొంగ్రొత్త ఆశల చిగుళ్ళ తోరణాలు....

---

# మార్పు... రానంతవరకు ?

- ఎస్.ఎమ్. సుభాని
94907 76184

ఏ పది శాతమో
ప్రగతి పథంలో
ఉన్నత శిఖరాల
నెక్కి ఉండవచ్చు
ఇంకా తొంబది శాతం
నారీ లోకం
మనం పెట్టే
శారీరక, మానసిక
క్షోభకు.. కన్నీరు
చిందిస్తూనే వుంది
ప్రేమకోసం దాడులు
కట్నంకై వేధింపులు
కార్యాలయాల్లో సాధింపులు
ఎదుర్కొంటూ
బెదురు బెదురుగా
భయం నీడలో
బ్రతుకుతూనే వుంది
364 రోజులు
సాధించి, వేధించి
సహనమూర్తిని బాధించి
తల్లిని, చెల్లిని



ఆలిని అవమానించి
కడుపులో
ప్రాణం పోసుకున్న
చిట్టి తల్లిని చిదిమేసి
చిద్విలాసం చిందించే
అమ్మ నాన్నలున్న
పాడులోకంలో
కుళ్ళి కంపుకొడుతున్న
విష సంస్కృతి
పరిష్వంగంలో చిక్కి
మత్తులో తూగుతున్న

మనసులు
మనుషులు
పరిసరాలు
పద్ధతులు
చట్టాలు
మారనంతవరకు
మనలో
మార్పు రానంతవరకు
విలువలేవో
విజయాలేవో చూపించి

కొన్ని ముచ్చట్లు
మరికొన్ని చప్పట్లు
దండలతో శాలువాలతో
కొందరిని సత్కరించి
ఘనంగా సన్మానించి
మహిళాదినోత్సవం
ఘనంగా జరుపుకొన్నాం
అంతమాత్రాన
ఒరిగిదేముంది
అన్యాయంగా
అమానుషంగా
బలిపీఠమెక్కిన
బాధితులకు
జరిగే మేలేముంది
ఆ... ఒక్కరోజు
మురిపాల సంబరాలు
రేపటి నుండి
షరా... మామూలు !



# "తలుగు" ఎందుకు తెగలేదు?"

- డా॥ తవ్వా వెంకటయ్య
97039 12727

పుట్టిన ఊరినే ఇంటి పేరుగా చేసుకొని కథలు రాస్తున్న యువ కథకుడు వేంపల్లె షరీఫ్. ఇతను వ్రాసిన 'జుమ్మా' కథల సంపుటికిగాను 2012లో కేంద్ర సాహిత్య అకాడమీ యువ పురస్కారాన్ని అందుకున్నాడు. ముస్లిం సామాజిక వర్గం నుంచి ఈ పురస్కారాన్ని అందుకున్న తొలియువ కథకుడు షరీఫ్. 60 ఏళ్ళకు పైబడిన స్వతంత్ర్య భారతదేశంలో మైనార్టీలుగా పిలువబడే ముస్లిం సామాజిక వర్గం నుంచి తలుగు వంటి కథ రావడం చర్చించవలసిన అంశం. నేటి సమాజంలో ఒక సంధి వాతావరణం నెలకొని వుంది. ఒకవైపు పూర్తిగా అల్లుకుపోతున్న ప్రపంచీకరణ, మరోవైపు ఇంకా మన భారతీయ గ్రామీణ వ్యవస్థను పట్టి పీడిస్తున్న సామాజిక రుగ్మతలు. నేటి యువతరం ఈ రెండింటి నడుమ ఏవైపు తూగాలో తెలియని అయోమయంలో వున్నారు. ఇటువంటి సమయంలో ముస్లిలలోని అగ్రవర్ణాలకు చెందిన యువకుడు తమ క్రింది వర్గాలు ఎదుర్కొంటున్న సమస్యలపై కథ రాయడం ఒకింత ఆశ్చర్యాన్ని మరికొంత ఆలోచనను కలుగచేయక మానదు. ఒక పుస్తకంగా వెలువడిన ఈ "తలుగు" కథ నేడు అతివేగంగా తెలుగు ప్రాంతాన్ని చుట్టేసి చాలా మంది పాఠకులకు చేరింది. చాలా మంది ముస్లింలు ముస్లిమేతరులు కూడా ఈ కథపై తమదైన శైలిలో స్పందించారు. కథలో ప్రధాన ఇతివృత్తం ఆధిపత్య భావజాలం. ఇందులో పాడిపశువులున్న వెంకటప్ప ఒకరోజు తన నూడి ఎనుము ఈనలేక చావు బ్రతుకుల మధ్య కొట్టుమిట్టాడుతుంటే అది చస్తే ఇంటి మాదిగోల్లకు ఉచితంగా ఇవ్వాలనే ఉద్దేశ్యంతో వెంకటప్ప గొడ్డుసీలు వ్యాపారం చేసే బోరెవాల కులానికి చెందిన దౌలును పిలిపించాడు. ఆ ఎనుమును దౌలు వద్దన్నా వినకుండా రూ. 1,200లకు కట్టబెడతాడు. దౌలు దీన్ని తీసికెళ్ళి కోసి మాంసం రూపంలో అమ్మి సొమ్ము చేసుకోవాలనుకుంటాడు. కానీ దౌలు అదృష్టమో లేక దురదృష్టమో ఆ ఎనుము ఈనింది. దీంతో సంతోషపడ్డ దౌలు తల్లిని పిల్లను కట్టేసి పెంచుకుంటూ ఉంటాడు. ఈ విషయం తెలుసుకున్న వెంకటప్ప దౌలు ఇంటికి తన మనుషులను పంపి ఎనుమును, దాని పిల్లను దౌర్జన్యంగా తోలుకొచ్చి తన గాటిలో కట్టేసుకుంటాడు. ఈ విషయం తెలుసుకున్న దౌలు ఇద్దర్ని పంచాయితీకి తీసుకెళ్ళి వెంకటప్పను ప్రశ్నిస్తాడు. దీనికి వెంకటప్ప తీవ్రంగా స్పందిస్తాడు. తన దగ్గర కొన్న ఎనుము ఈనినట్టు తన కెందుకు చెప్పలేదని దబాయిస్తాడు. బదులుగా దౌలు ఎనుమును తాను కొన్నాడు కాబట్టి అది తనదేనంటాడు. అంతకు మునుపు ఒకసారి దౌలు వెంకటప్ప దగ్గర ప్రాణాలతో కొట్టుమిట్టాడుతున్న ఎద్దును కొంటాడు. దాన్ని కొని ఇంటికి తీసుకెళ్ళేలోపు మరణిస్తుంది. ఇది అన్యాయమని దౌలు వెంకటప్పను ప్రశ్నిస్తే "ఒకసారి కొనుక్కొన్నాక నష్టం వచ్చినా, లాభం వచ్చినా నీకే సంబంధం వాయ్" అంటాడు. దీన్ని గుర్తుచేసి దౌలు వెంకటప్పతో అప్పుడు నువ్వు చెప్పిన న్యాయం ప్రకారమే ఈ ఎనుము తనకే చెందాలంటాడు. ఎద్దు విషయంలో అప్పుడు అది న్యాయమని చెప్పిన వెంకటప్ప ఇప్పుడు మాత్రం దౌలు కొన్న ఎనుము ఈనిందని అది తనకే చెందుతుందని దాన్ని తన గట్లె కట్టేసుకుంటాడు. దౌలుకు ఇచ్చిన ఎనుమును బలవంతంగా తెచ్చి కట్టేసుకోవడమే కాకుండా దాన్ని ప్రశ్నించినందుకు దౌలు ఇచ్చిన రూ. 1,200లు కూడా ఎగ్గొడ్తాడు. అంతేకాదు దీన్ని

ప్రశ్నించినందుకు దౌలుపై వెంకటప్ప కట్టెతో దాడిచేయబోతాడు. దాన్ని పట్టుకుంటాడు దౌలు. ఇదే సమయంలో గాట్లో ఎనుము దౌలుకు జరుగుతున్న అన్యాయంపై కోపంతో తన కొమ్ముల్ను నేలపై కొడుతూ వెంకటప్ప పైకి తలుగు తెంపుకోవడం కోసం గుంజుకుంటూ వుంది. ఇది తలుగు కథ పూర్తిపాఠం.

ఇదే కథలో అంతర్లీనంగా రచయిత మరో అంశాన్ని కూడా చిత్రించాడు. దౌలు గొడ్డుమాంసాన్ని అమ్ముకుంటూ మాదిగిల్లలోకి వెళ్తాడు, అదే సమయంలో ఎదురైన మటన్ కొట్టే కరీమ్ సాబ్ దౌలును అసహ్యంగా చూస్తూ 'మీ బోరేవాళ్లు జేచ్చాండే పనికి మా అట్టాంటోళ్ళకు కూడా చెడ్డపేరు వొచ్చాండదయ్యా మీకేం గొడ్లను కోచ్చారు. తింటారు. మల్లా అమ్ముతారు ఎబ్బుడన్నా కర్మగాలి ఇట్టా ఎదురయ్యి మీతో కనబడినమే అనుకో ఇంక మేముకూడా తింటాండమన్నట్లే లెక్క మేం తినము సోమీ అని ఎంత చెప్పినా ఎవరూ నమ్మడంల్యా అఖరికి మా ఇండ్లల్లో ఆడ పిల్లోళ్లకు సంబంధాలు కూడా రావడం లేదనుకో అంటాడు. ఈ మాటకు దౌలు ఇది గడక ఒకందుకు మంచిదేగదన్నా ఇబ్బుటికైనా మీకు రోంతైనా అర్థమయిండాది. ఒక దిక్కు హిందువులు తక్కువగా జూచ్చా మరో తిక్కు సాయిబులు అయ్యుండి గుడక మీరు తక్కువగా చూచ్చా.. మేమెంత ఇబ్బంది పడతాండామో అన్నాడు దౌలు. ఈ సన్నివేశంలో ముస్లింలలో ఉన్న నిమ్నవర్గాలలో ఉన్న అంటరానితనం స్పష్టం అవుతుంది. ముస్లింలలో ఒక అగ్రవర్ణాలకు చెందిన ముస్లీం యువకుడు తన క్రింది వర్గాలు పడుతున్న మానసిక సంఘర్షణ వాతావరణాన్ని అత్యంత హృదయ విదారకంగా చిత్రించడం హర్షించదగ్గ విషయం. కానీ భారతదేశంలో మైనార్టీలుగా పిలువబడుతున్న ముస్లింలలో ఇటువంటి అనైక్యతకు, అంటరాని తనానికి గల కారణాలను సూచన ప్రాయంగా కూడా రచయిత తెలియచేయకపోవడం కథలో కొంత కొదువగా ఉన్నట్లు తోస్తుంది.

**భారతదేశంలో మైనార్టీలుగా పిలువబడుతున్న ముస్లింలలో ఇటువంటి అనైక్యతకు, అంటరాని తనానికి గల కారణాలను సూచన ప్రాయంగా కూడా రచయిత తెలియచేయకపోవడం కథలో కొంత కొదువగా ఉన్నట్లు తోస్తుంది.**

ఈ కథ రెండు ప్రధాన విషయాలను కేంద్రీకృతంగా చేసుకొని నడిచింది. మొదటిది ఆర్థికంగా బలవంతుడైన వెంకటప్ప దౌలును నిర్దాక్షిణ్యంగా దోచుకోవడం వెంకటప్ప రెండు న్యాయాలు చెపుతాడు. మొదటి న్యాయం తన ఎద్దు దౌలుకు అమ్మగా అది దారిలో చనిపోతే దానికి తనకు సంబంధం లేదని ఒకసారి కొన్నాక నష్టం వచ్చినా, లాభం వచ్చినా దౌలుయే అనుభవించాలని చెప్పాడు. రెండవ న్యాయం వెంకటప్ప ఎనుమును దౌలుకు అమ్మగా అది దూడను ఈనిందని తెలిసి అది తనకే చెందుతుందని చెప్పడం. ఇలా ఒకే వ్యక్తి రెండు న్యాయాలు చెపుతాడు. ఇక్కడ ఒక దానికొకటి సంబంధం లేకుండా ఉండడం, ఆ రెండు న్యాయాలు ఆర్థికంగా బలవంతుడైన వెంకటప్పకే అనుకూలంగా వుండడం. ఈ రెండింటిలోను బలిపశువు దౌలుయే. అంటే నిరుపేదల్ని ఆర్థికంగా బలవంతులైన కొందరు భూస్వాములు దోచుకోనే తీరును అత్యంత సహజంగా చిత్రించింది ఈ కథ. కానీ కథ చివర్లో దౌలుకు జరిగే అన్యాయాన్ని దౌలు ధైర్యంగా ఎదుర్కోవడం మంచి పరిణామం. కానీ నిరుపేద వర్గాలను పశువుతో పోల్చి ఆ పశువును కట్టేసినట్లుగా నిరుపేద వర్గాలను బంధించిన వర్గాలను, పెట్టుబడి దారీ వ్యవస్థను తలుగుతో పోల్చి ఆ నిరంకుశ వ్యవస్థను బలహీన వర్గాలు తెంచుకోబుతున్నాయని చెప్పడం రేపటి తరంలో జరగబోయే సామాజిక విప్లవానికి ఈ కథ నాందివాక్యం కాక తప్పదు. కానీ ఆ తలుగు ఎందుకు తెంచుకోలేదో రచయిత ఎక్కడా ప్రత్యేకంగా ప్రస్తావించలేదు. అది పాఠకులకు వదిలివేయడం ఎన్నో మెదడ్లను కదిలించినట్లయింది. కానీ ఇక్కడ అర్థం కావాల్సిన విషయం ఒకటుంది. స్వతంత్ర్యం వచ్చి ఇన్నేళ్లయినా ఈ తలుగు ఎక్కడా నూలుపోగు కూడా తెగలేదు. మరో రూపాంతరం చెంది ఈ తలుగు మరింత జఠిలం అవుతుంది. మరో వంద సంవత్సరాలైన ఈ తలుగు తెంచుకోవడం కోసం నిరుపేద వర్గాలు గుంజుకోవడం తప్ప ఆ తలుగు తెగదు. ఈ కథ కుల వ్యవస్థనో లేక అగ్రవర్ణాల ఆధిపత్యాన్నో చిత్రించిన కథ కాదు. కేవలం పెట్టుబడి దారులకు - శ్రామికులకు, ఉన్నవారికి - లేనివారికి మధ్య ఉన్న ఆధిపత్య పోరును అణచివేతధోరణిని దోపిడీ తత్వాన్ని చిత్రించిన కథమాత్రమే. ఈ కథలో మరో విషయం ముస్లింలే తమ క్రింది కులాలైన బోరేవాలాలను హీనంగా చూడడం ఈ కథకు ఒక ప్రత్యేకత వుంది. ఈ కథ కేవలం ముస్లింల వర్గాలలో వున్న అంటరాని తనాన్ని మాత్రమే చిత్రించినప్పటికీ ఇందులో చాపక్రింది నీరులాగ అన్ని వర్గాలలోని కదలిక తీసుకురాగలిగే ప్రయత్నం మాత్రం చేసింది. దళితులలోనే ధనవంతులు పేద దళితుల్ని హీనంగా చూడడం అలాగే ధనవంతులైన స్త్రీలు నిరుపేదలైన స్త్రీలను అసహ్యంగా చూడడం అనే పరిస్థితులను ఈ కథ అంతర్లీనంగా ప్రతిబింబించింది. వీటన్నింటిని ప్రశ్నిస్తూ ప్రతి కుల వర్గాలలో స్వీయ సంస్కరణ అవసరాన్ని ఈ కథ లేవనెత్తింది.

ఏదిఏమైనా ఈ తలుగు ఇంకా తెగలేని పరిస్థితులను చర్చకు తీసుకురావల్సిన అవసరం ఉంది. ఆ తలుగు తెగలేని స్థితిని మరొక కథ ద్వారా రచయిత కొనసాగించి స్పష్టపరచాలి. ఈ తలుగు కథ భారతదేశ మైనారిటీ వర్గంలో పుట్టి భారతదేశంలో పాతుకుపోయిన ఆర్థిక, సామాజిక అంశాలన్నింటిని అంతర్లీనంగా ప్రశ్నించి నందనడంలో సందేహం లేదు. ❧

## హంగేరీ రచయితకు ఇంటర్నేషనల్ బుకర్ ప్రైజ్




హంగేరీ రచయిత లాస్జ్లో క్రాజానహొరకాయ్ బ్రిటన్‌కు చెందిన ప్రతిష్టాత్మకమైన ది మ్యాన్ బుకర్స్ అంతర్జాతీయ పురస్కారాన్ని గెలుచుకున్నారు. ఫిక్షన్ రచనల్లో ఆయన చూపిన కౌశలానికి, ప్రతిభకు గానూ ఈ పురస్కారం లభించింది. భారతదేశానికి చెందిన అమితవ్ ఘోష్, మరో ఎనిమిది మందిని తోసిరాజని ఆయన ఈ అత్యున్నత సాహితీ పురస్కారాన్ని గెలుచుకున్నారు. విద్యావేత్త, రచయిత, న్యాయమూర్తుల బృందం అధ్యక్షురాలు, ప్రముఖ రచయిత్రి మారియానా వార్నర్ మే 19న ఈ పురస్కారాన్ని ప్రకటిస్తూ లాస్జ్ల రచనలను ఫ్రాంజ్ కఫ్కాతో పోల్చారు. లాస్జ్లో వ్యక్తిగతంగా అభిమానించే రచయిత ఫ్రాంజ్ అని చెబుతూ 'ఉత్తమ రచయితల నైపుణ్యాలు ఇలానే ఉంటాయి. వింతైన, కొత్తైన థ్రిల్‌ను మీకు అందిస్తారు. ఆ తర్వాత కొంతకాలానికి మిమ్మల్ని ఊహాత్మకంగా రీ ట్యూన్ చేస్తారు. ఇప్పుడు మేం చెప్పేదేమిటంటే ఈ నవల కఫ్కా కథనంలా ఉంది. అయితే అతి త్వరలోనే ఇది క్రాజానహొరకాయ్ కథనంలా వుంటుందని మేం చెప్పాల్సి వుంది" అని ఆమె ఆయన రచనలను, శైలిని, ప్రశంసిస్తూ పేర్కొన్నారు. విక్టోరియా అండ్ అల్బర్ట్ మ్యూజియంలో ఏర్పాటైన ఒక కార్యక్రమంలో లాస్జ్లో (61) పురస్కారాన్ని స్వీకరిస్తూ మాట్లాడారు. ఈ ఘనత అంతా కూడా కాఫ్కాకే చెందుతుందని అన్నారు. రెండేళ్ళకోసారి ఇచ్చే మ్యాన్ బుకర్ అంతర్జాతీయ పురస్కారం క్రింద 60వేల పౌండ్లు ఇస్తారు. ఇంగ్లీషులో కానీ లేదా ఇంగ్లీషు అనువాదంలో కానీ వారి రచనలు ఉండాలి. రచయిత జీవిత కాలంలో ఒకే ఒక్కసారి ఈ అవార్డు అందుకోగలుగుతారు. ఈ ఏడాది అవార్డుకు ముందుగా 10 మందిని ఎంపిక చేశారు. అందులో నుండి లాస్జ్లోని ఎంపికచేశారు. తొట్టతొలి జాబితా 10 మందిలో భారత్‌కు చెందిన అమితవ్ ఘోష్ ఉన్నారు. 'ఎవరినో ఒక విజేతను ఎంపిక చేయడానికి తాము ప్రాధాన్యత ఇవ్వబోమని, ముందుగా జాబితా అంతా వడపోసి 10 మందిని ఎంపిక చేస్తామని, వారి నుండి ఒకరిని ఎన్నుకుంటామని, కానీ ఈ 10 మంది కూడా సాహిత్యానికి సంబంధించి వేర్వేరు విధానాల్లో మంచి ప్రతిభా పాటవాలు వున్నవారేనని వార్నర్ పేర్కొన్నారు

## జ్ఞాపకాల చెరువు


- వెన్నెల సత్యం
9440032210




ఆరోజు నాకు బాగా గుర్తు
కొత్త సంవత్సరానికి లోకమంతా
కోటి ఆశలతో స్వాగతం పలుకుతున్నరోజు!
కొత్త కొలువులో చేరుదామని
మీ ఊరికి చేరువవుతున్న నాకు
పచ్చని ప్రకృతిని పరికిణీగా చుట్టుకొని
పల్లెటూరి పడుచులా ఎదురొచ్చి
ఓ బొమ్మరాసిపేట చెరువూ...
ఆత్మీయంగా నన్ను పలకరించావు...!
అమ్మతనం రాశిపోసినట్లున్న
నీ పిలుపుతో ఈ హృదయాన్ని పులకింపజేశావు!
గలగలమనే నీ చిరు అలల సవ్వడిలో
నిశ్శబ్దంగా సాగిన మన ముచ్చట్లు దాచుకున్నావు
కరువుతో గుండె చెరువై, బతుకు బరువై
భారంగా బతుకీడుస్తున్న బడుగు రైతుల
పంట చేలల్లోకి పరవళ్ళెత్తి పారుతున్నప్పుడు
విన్నానులే చెరువమ్మా..! నీ గుండె చప్పుడు!
నీ హృదయమే విశాలమనుకున్నా గానీ
నీ ఊర్లో ప్రతి పసి హృదయం మరెంతో విశాలమని
తెలిశాక!
ఆ పిల్లలు చూపిన అభిమానం
ఎప్పటికీ ఎదలో మరపు రాక..!
మనసునిండా సుడులు తిరుగుతోన్న
ఆ చెరువు జ్ఞాపకాలను వదులుకోలేక!
బాధగా నా మనసు మౌనంగా
పెడుతోంది ఓ గావుకేక !!

# సమకాలీన సమస్యల్ని చిత్రించిన నవలలు



- అంపశయ్య నవీన్
9989291299

మాకు నవలల్ని పంపించినప్పుడు ఆ నవలా రచయిత పేర్లేమిటో తెలియకుండా నిర్వాహకులు జాగ్రత్తపడ్డారు. ఆ నవలల మీద ఒక నెంబర్ మాత్రమే ఉంటుంది. కాబట్టి ఆ నవలలు రాసిన రచయితలెవరు? వాళ్ళు ఏ ప్రాంతానికి చెందిన వాళ్ళు లాంటి వివరాలు మాకు తెలిసే అవకాశం లేదు. ఈ కారణం వల్ల న్యాయ నిర్ణేతలు ఎలాంటి ప్రభావాలకు లొంగకుండా ఒక నవల యొక్క నాణ్యతను బట్టే బహుమానాలను నిర్ణయించటం జరిగిందని చెప్పొచ్చు.

సీపీఐ(ఎం) పార్టీ 21వ జాతీయ మహాసభల ఆహ్వానసంఘం నిర్వహించిన నవల, కథ, కవితల పోటీల సందర్భంగా నవలలపోటికి వచ్చిన నవలల్ని చదివే అవకాశం లభించింది. ఈ నవలల్ని చదివి మొదటి మూడు బహుమానాలు యే నవలలకివ్వాలో నిర్ణయించే ముగ్గురు న్యాయనిర్ణేతల్లో నేనొకర్ని.

ఈ పోటీకి మొత్తం 3 నవలలు వచ్చాయని వాటిల్లోంచి 17 నవలల్ని ఈ పోటీని నిర్వహిస్తున్న నిర్వాహకులు నాకు పంపించారు. (మిగతా 14 నవలల్ని) నిర్వాహకులు ప్రాథమిక దశలోనే మినహాయించారు).

నేను చదివిన ఈ 17 నవలల్లో బహుమానాలు పొందిన ఆ మూడు నవలలే కాకుండా మరో నాల్గు నవలలు కూడా బావున్నాయనిపించింది. ఆ 7 నవలల్ని క్లుప్తంగా సమీక్షించటం కోసం ఈ వ్యాసం.

మాకు నవలల్ని పంపించినప్పుడు ఆ నవలా రచయిత పేర్లేమిటో తెలియకుండా నిర్వాహకులు జాగ్రత్తపడ్డారు. ఆ నవలల మీద ఒక నెంబర్ మాత్రమే ఉంటుంది. కాబట్టి ఆ నవలలు రాసిన రచయితలెవరు? వాళ్ళు ఏ ప్రాంతానికి చెందిన వాళ్ళు లాంటి వివరాలు మాకు తెలిసే అవకాశం లేదు. ఈ కారణం వల్ల న్యాయ నిర్ణేతలు ఎలాంటి ప్రభావాలకు లొంగకుండా ఒక నవల యొక్క నాణ్యతను బట్టే బహుమానాలను నిర్ణయించటం జరిగిందని చెప్పొచ్చు.

మొదట బహుమతుల్ని గెల్చుకున్న నవలల విషయం చూద్దాం. ప్రథమ బహుమతిని "వ్యూహం" అనే నవల (30 వేలు) గెల్చుకుంది. ఈ నవలను రచించింది శిరంశెట్టి కాంతారావు అని మాకు బహుమతుల్ని ప్రకటించాకే తెలిసింది. ద్వితీయ బహుమతిని సన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి రచించిన "మబ్బులు వాలని నేల" తృతీయ బహుమతి "కడలి కల్లోలం" అనే గ.నా.రా (గదుల నాగేశ్వరరావు) రచించన నవల గెల్చుకున్నాయి.

"వ్యూహం" ఒక స్టీలు కర్మాగారంలో పనిచేస్తున్న కార్మికులకు సంబంధించిన సమస్యల్ని అత్యంత వాస్తవికంగా చిత్రించింది. ఖాసిం, రాజు అనే ఇద్దరు కార్మికులు 35 మీటర్ల ఎత్తున ఉన్న కూలింగ్‌టవర్ మీద గాలిలో వేలాడుతూ వెల్డింగ్ కొడుతుంటారు. పని ముగించుకొని కిందకు దిగుతున్న హెల్పర్ రాజు సెఫ్టీబెల్ట్ సరిగ్గా పనిచెయ్యకపోవడంతో అంత ఎత్తు నుండి నేలమీదకు పడిపోయి చనిపోతాడు.

రాజు కుటుంబానికి నష్టపరిహారం అందించే విషయంలో

కార్మికసంఘాలు ఆ కర్మాగారం యాజమాన్యంతో చేసే పోరాట చిత్రణే ఈ నవల. కార్మిక సంఘాల్లో చోటు చేసుకునే రాజకీయాలు... రెండు ప్రత్యర్థి యూనియన్ల మధ్య యేర్పడే పోటీ.. ముఖ్యంగా కార్మిక సంఘాలకు జరిగే ఎన్నికలు.. ఆ ఎన్నికల్లో జరిగే అక్రమాలు.. డబ్బు, మద్యం పంచడాలు.. ఇవన్నీ ఈ నవలలో ఎంతో లోతుగా, వాస్తవికంగా చిత్రించబడ్డాయి. రెండుగా చీలిపోయిన కార్మిక సంఘాల్లో... ఒక సంఘపు నాయకులు యాజమాన్యానికి అనుకూలంగా పనిచెయ్యడం.. ఇంకో సంఘపు నాయకులేమో చిత్తశుద్ధితో కార్మికులకు న్యాయం చెయ్యాలని ప్రయత్నించడం. యాజమాన్యం వారు తమకు అనుకూలంగా పనిచేసే సంఘపు నాయకులను గెలిపించటం కోసం తమ శాయశక్తులు ఒడ్డి పనిచెయ్యటం... ఎన్నికలు జరిగాక చాలా ఆశ్చర్యంగా యాజమాన్యానికి అనుకూలంగా పనిచేసే సంఘమే ఒక్క ఓటు మెజారిటీతో గెలవడం ఒక కార్మికుణ్ణి యాజమాన్యానికి అనుకూలంగా పనిచేస్తున్న సంఘపువారు బాగా తాగించి చంపేయడం ఇలా ఒక స్టీలు ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికుల సంఘాలెలా పనిచేస్తాయో ఈ నవలను రచించిన శిరంశెట్టి కాంతారావు అద్భుతంగా స్వానుభవంతో చిత్రించాడు. అలాగే కార్మికుల ఐక్యతను దెబ్బతీయటానికి యాజమాన్యం పన్నే రహస్య వ్యూహాలను కూడా ఈ నవల బహిర్గతం చేసింది.

రెండవ బహుమతి గెల్చుకున్న "మబ్బులు వాలని నేల"ను రచించిన సన్నపురెడ్డి వెంకటేశ్వరరెడ్డి ఈ నవలలో రాయలసీమ ప్రాంతపు రైతుల సమస్యల్ని చిత్రించాడు. రాయలసీమ అనగానే మనకు వెంటనే గుర్తొచ్చే అంశం. అక్కడ వర్షాలు ఎప్పుడూ సరిగ్గా కురవవని, వర్షాభావం వల్ల అక్కడి రైతులెప్పుడూ వర్షలెప్పుడు కురుస్తాయని అని ఆకాశం వైపు చూస్తుంటారు. రాయలసీమ ప్రాంతపు రచయితలైన కేతు విశ్వనాధరెడ్డి, సింగమనేని నారాయణ లాంటి రచయితల కథల్లోనూ, నవలల్లోనూ రాయలసీమ రైతుల ఈ దయనీయ స్థితిని చిత్రించారు. ఈ "మబ్బులు వాలని నేల" నవలలో కూడా రాయలసీమ ప్రాంతపు రైతుల దీనగాధనే రచయిత పాఠకుల ముందుంచాడు.

***రాయలసీమ ప్రాంతపు రచయితలైన కేతు విశ్వనాధరెడ్డి, సింగమనేని నారాయణ లాంటి రచయితల కథల్లోనూ, నవలల్లోనూ రాయలసీమ రైతుల ఈ దయనీయ స్థితిని చిత్రించారు. ఈ "మబ్బులు వాలని నేల" నవలలో కూడా రాయలసీమ ప్రాంతపు రైతుల దీనగాధనే రచయిత పాఠకుల ముందుంచాడు.***

ఈ నవలలోని ప్రధాన పాత్రలైన శివుడు, గౌరీల దంపతులది వ్యవసాయ కుటుంబం. స్వయంగా కష్టం చేసుకుంటూ తమకున్న వ్యవసాయ భూమిని సాగు చేసుకుంటుంటారు. ఎన్నో ఆటుపోట్లను ఎదురుకుంటూ వ్యవసాయాన్ని నమ్ముకొని బతుకుతుంటారు. వర్షాల మీద ఆధారపడి లాభం లేదని తమ పొలాల్లో బ్యాంకు నుండి రుణాలు తీసుకొని బోర్లు వేయించుకునే ప్రయత్నం చేస్తారు. నాల్గైదువందల మీటర్ల లోతుకెళ్ళిన బోర్లలో నీళ్ళు పడవు. అయితే ఈ నవలలోని శివ (శివరామిరెడ్డి) బ్యాంకు రుణం తీసుకొని బోర్‌వేయిస్తే దాంట్లో నాల్గైదువందల మీటర్ల లోతుకెళ్ళాక నీళ్ళు పడ్డాయి. దాంతో అతడు తను సాగు చేస్తున్న భూమికి నీళ్ళు పారించగల్గుతాడు.

వర్షాల కురువకపోవడమే కాకుండా రాయలసీమ రైతులను మరో సమస్య వేధిస్తుంటుంది. వాళ్ళు వేసుకున్న వేరుశనగలాంటి పంటలు కాపుకొచ్చాక ఆ పంటల మీద అడవి జంతువులు, ఏనుగులు, అడివిపందులు దాడిచేసి నాశనం చేస్తున్నాయి. ఈ అడివి జంతుల బారి నుండి తమ పంటల్ని కాపాడుకోవటానికి రైతులెంతగా తమ ప్రాణాల్ని ఫణంగా పెట్టి పోరాడుతారో కూడా ఈ నవలలో రచయిత చిత్రించాడు. అలాగే రైతులు ఆత్మహత్య చేసుకొంటే ప్రభుత్వం పెద్ద మొత్తంతో తమ కుటుంబాన్ని ఆదుకుంటుందని తమ కుటుంబానికి అప్పుల బెడద తప్పుతుందని భావించిన కొందరు రైతులు ఆత్మహత్యలకు ప్రయత్నించటం, రామయ్య అనే రైతు తన కొడుకును ఇంజనీరింగ్ చదివించటం కోసం ఆత్మహత్యకు ప్రయత్నిస్తాననడం ఇది తెలుసుకున్న అతని కొడుకు అతన్ని వారించటం ఇలా రాయలసీమ రైతుల అనేక సమస్యలకు ఈ నవల అద్దం పట్టింది. ఈ నవల చివర్లో రామయ్య కొడుకు తన తండ్రిని ఆత్మహత్య చేసుకోవద్దని చెప్పి, ఒక సంపన్న కుటుంబం వారు తనను వాళ్ళ కుంటి అమ్మాయిని పెళ్ళి చేసుకుంటే బిటెక్ చదివిస్తారని, తను కుంటమ్మాయిని చేసుకుంటానని చెప్పడం - కాస్తా సినిమాటిక్‌గా వుంది.

మూడవ బహుమతి పొందిన గ.నా.రా రచించిన 'కడలి కల్లోలం' నవల కాకినాడ దగ్గరి 'భైరవద్వీపం'లో నివసిస్తున్న మత్స్యకారుల సమస్యలను చిత్రించింది.

యానాం దగ్గర సముద్రంలో పెట్రోలియం గ్యాస్ నిక్షేపాలున్నాయని తెలియడంతో ఆ ప్రాంతానంతా అంబానీలాంటి బడా పెట్టుబడిదారులు ఆక్రమించేస్తారు. దాంతో సముద్రం మీదకు వెళ్ళి చేపలు పట్టుకుని బతికే మత్స్యకారుల బతుకులు చిందరవందర అయిపోతాయి.

ఈ బడా పెట్టుబడిదారుల ఏజంట్లు బలవంతంగా ఆ

చుట్టుపక్కల వున్న పేదవాళ్ళ బతుకుల్ని కొనేస్తారు. భైరవద్వీపంలో తరతరాలుగా జీవిస్తున్న మత్స్యకారుల్ని ఆ ద్వీపాన్ని ఖాళీ చేసి వేరే చోటికి వెళ్ళిపొమ్మంటారు. వాళ్ళకు వేరేచోట ఇళ్ళు కట్టించామంటారు. కానీ అక్కడ నివసిస్తున్న ప్రజలు తాము పుట్టి పెరిగిన ప్రాంతాన్ని విడిచి వెళ్ళడానికి అంగీకరించరు. వారు బడా పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా పోరాటాన్ని ప్రారంభిస్తారు. గంగ అనే మత్స్యకారుల కుటుంబానికి చెందిన ఆమె ఈ పోరాటానికి నాయకత్వం వహిస్తుంది. రాజకీయ నాయకులు, పెట్టుబడిదారులతో కుమ్మక్కై మత్స్యకారుల పోరాటాన్ని అణిచేయాలని చూస్తారు. గంగ నాయకత్వంలో జరుగుతున్న పోరాటాన్ని అణిచేసే క్రమంలో పోలీసులు జరిపిన లాఠీఛార్జీలో గంగ తీవ్రంగా గాయపడుతుంది. స్పృహ తప్పి పడిపోతే ఆమెను ఆసుపత్రికి తీసికెళ్తారు. ఆమెకు స్పృహ రావడంతోనే 'మనం పోరాడాలి... మనిషి చచ్చిపోకూడదు... బ్రతకాలి... పోరాడటానికై బతకాలి' అంటుంది- ఇలా బడా పెట్టుబడిదారులు జరుపుతున్న దౌర్జన్యాలకు వ్యతిరేకంగా మత్స్యకారులు జరిపిన వీరోచితపోరాటాన్ని ఈ ' కడలి కల్లోలం' నవల గొప్పగా చిత్రించింది. ఈ నవలకు 'కడలి కల్లోలం' అన్న పేరు ఎంతో సముచితంగా వుంది.

ఈ బహుమతుల్ని గెల్చుకున్న నవలలే కాకుండా ఈ పోటీకొచ్చిన మరికొన్ని నవలలు కూడా బాగున్నాయి. వాటిలో ప్రప్రథమంగా చెప్పవలసిన నవల 'మెతుకు పుస్తకం'.

రామగుండంలో పబ్లిక్‌సెక్టార్‌లో నెలకొల్పబడిన ఎరువులను తయారుచేసే చాలా పెద్ద కర్మాగారం : ఫెర్టిలైజర్ కార్పొరేష్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌సిఐ) ను నష్టాలొస్తున్నాయనే నెపంతో మూసివేసే పరిస్థితి సృష్టించబడటం - దీనివల్ల ఆ కర్మాగారంలో పనిచేస్తున్న వేలాదిమంది ఉద్యోగస్తులు అకస్మాత్తుగా నిరాశ్రయులైపోవడం - ఈ సమస్యను ఈ మెతుకు పుస్తకం నవల చిత్రించింది. రామగుండం ప్రాంతంలో ఈ సింగరేణి బొగ్గు గనులుండటం - అక్కడే ఎన్.టి.పి.సి. లాంటి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే కర్మాగారం, ఎరువుల్ని ఉత్పత్తి చేసే (ఎఫ్‌సిఐ) ఫెర్టిలైజర్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా ఉండటం, అలాగే సమృద్ధిగా నీరు లభించే గోదావరి నది ఉండటం- ఈ కారణాల వల్ల ఈ ప్రాంతాన్ని "మాంచెస్టర్ ఆఫ్ ఇండియా" అని పేర్కొనడం అయినప్పటికి పబ్లిక్ సెక్టార్‌లో నెలకొల్పబడిన ఇలాంటి పరిశ్రమల్ని దివాలా తీయించి మూసెయ్యాలని కేంద్రప్రభుత్వం నిర్ణయించుకోవడం- ఇలాంటి చర్యల్ని వామపక్ష పార్టీలు, తీవ్రంగా వ్యతిరేకించినా ఫలితం లేకపోవడం - ఈ అంశాలనన్నంటిని ఈ నవల చిత్రించింది. అక్కడక్కడ చెప్పిన విషయాన్నే పదే పదే అనేక చర్చల ద్వారా చెప్పడం వల్ల ఈ నవల సైజు అనవసరంగా పెరిగిపోయిందనిపించినా, ఎఫ్‌సి... లాంటి ఒక పెద్ద కర్మాగారాన్ని మూసేయించే అత్యంత విషాదకర పరిణామాన్ని ఈ నవల గొప్ప వేదనతో చిత్రించింది. (ఈ నవలను రచించింది. కాలువ మల్లయ్య అని తెలిసింది.)

"గారడీ" అనే నవల తన కుల వృత్తి అయిన క్షౌరవృత్తిని చేసుకొని బతికే నారాయణ (నారయ్య) అనే క్షురకుని జీవితాన్ని చిత్రించింది. క్షౌరవృత్తిలోని సమస్యల్ని చిత్రించిన నవలలు ఇంచుమించు లేవనే చెప్పాలి. తిరుపతి కొండమీద భక్తుల తలలు కొరిగే క్షురకుల్లో నారయ్య, అతని మామ ఎర్రయ్య సహాయంతో చేర్తాడు. అప్పుడతని ఆదాయం బాగానే ఉంటుంది. కానీ అతనికి అతడు చెయ్యని దొంగతనాన్ని అంటగట్టి అతన్ని తిరుపతి కొండమీద క్షురకుల్లోంచి తొలగించటంతో అతనికి జీవించటం దుర్భరమౌతుంది. మేనమామ కూతురు పోలమ్మను పెళ్ళి చేసుకుంటాడు. పిల్లల్ని కూడా కంటాడు. కానీ భార్యపిల్లల - ఆకలిని తీర్చటానికి సరిపోయేంత ఆదాయాన్ని సంపాదించలేకపోతాడు. సరి అయిన ఆహారం తీసుకోకపోవడం వల్ల అతనికి క్షయరోగం సోకుతుంది. ఆసుపత్రి చేర్తాడు. నారయ్య ఊర్లోనే ఉండే పెద్ద మాష్టారనే ఆయన నారయ్య కుటుంబానికి చాలా సహాయం చేస్తాడు. ఆసుపత్రిలో క్షయరోగం నిండి నారాయణ ఆసుపత్రిలోని రోగులకు క్షౌరాలు చేస్తూ కాస్తో కూస్తో సంపాదించి భార్య పిల్లల్ని పోషించుకుంటున్నాడని చెబుతూ రచయిత ఈ నవలను ముగించాడు. అయితే ఈ నవలకు రచయిత "గారడీ" అన్న పేరెందుకు పెట్టాడో అర్థం కాలేదు.

*"నడిచే నీడలు" అన్న నవల వార్తాపత్రికల్లో పనిచేసే పాత్రికేయులను గురించి, ఆ పత్రికల్ని నడిపే యాజమాన్యాలను గురించి, ఈ రోజుల్లో వార్తా పత్రికల్లో చోటుచేసుకుంటున్న అనేక అవాంఛనీయ పరిణామాలను గురించి చర్చిస్తుంది.*

"నడిచే నీడలు" అన్న నవల వార్తాపత్రికల్లో పనిచేసే పాత్రికేయులను గురించి, ఆ పత్రికల్ని నడిపే యాజమాన్యాలను గురించి, ఈ రోజుల్లో వార్తా పత్రికల్లో చోటుచేసుకుంటున్న అనేక అవాంఛనీయ పరిణామాలను గురించి చర్చిస్తుంది. ఇవ్వాళ్టి పత్రికలన్నీ బడా పెట్టుబడిదారుల చేతుల్లోనే ఉన్నాయనీ పత్రికల మధ్య నెలకొన్న తీవ్రమైన పోటీ కారణంగా ప్రతి పత్రిక తన సర్క్యులేషన్‌ను పెంచుకోవడం కోసం అడ్డదారులు తొక్కడం! డబ్బులు తీసుకొని వార్తల్ని ప్రచురించటం (**paid news**) ముఖ్యంగా సాధారణ ఎన్నికలొచ్చినప్పుడు కొందరు అభ్యర్థుల నుండి పెద్ద మొత్తంలో డబ్బులు తీసుకొని వాళ్ళకు అనుకూలంగా, వాళ్ళు గెలువబోతున్నరన్నట్టుగా వార్తాల్ని ప్రచురించటం - ఇలా పత్రికా రంగంలో చోటు చేసుకుంటున్న అసాంఘిక

# ఒలికిన అమృతం

- బి. రవికుమార్
83328 54601



పసరు పిల్లిపెసరల కోసం
చిలుకలు గుంపులు గుంపులుగా వాలిన నేల
జుర్రుకున్న మకరందంతో తుమ్మెదలు ఝుంకారం చేసే జాడ
లతలు, లేలేత కూరలు - ఫలములకు నెలవు
దారి కాచిన దొంగ
ఒక్క దెబ్బకు బలైపోయినవి..!
నదిలో సునామి వచ్చినట్లు
పిల్లకాలువల్లో ముసళ్లు మసలుతున్నట్లు
గగన తలంలో విదేశీ అతిథుల వీక్షణాలు
వంటికి ముళ్లే కొరుకుతున్నాయి
విహరిస్తున్న గద్దల నీడలకు జడిసి
గుమ్మాలు రెక్కలు కట్టుకు ఎగిరిపోతున్నవి
మొండి గోడల నడుమ కిటికీల కంతల్లో
బల్లి గుడ్లు పోగులు పడుతున్నవి....!
సాలి గూడులా మారిన రాజధాని భూసేకరణలో
గండు చీమలు పెడుతున్నవి పుట్టలు
పేదలను తొలచి నివసించేను వాటిలో
ఇక పాములు
భూమాత పాలు తాగిన
సుతుల బతుకుల్లో తీరని ఎడారి దప్పిక
పొదుగు కుడిసే లేగ దూరమైన తల్లి
ఎదురుచూపులు - నేలపాలైనవి ఇక....!

పరిణామాలను ఈ నవల చిత్రించింది. అశోక్‌వర్దన్ అనే ఒక మంచి పాత్రికేయుడు ఇలాంటి ఆగడాలకన్నింటికి తనే గొప్ప ఆదర్శాలతో ఒక పత్రికను స్థాపించాలని నిర్ణయించుకుంటాడు. ఈ నవలను చదువుతోంటే మన కొన్ని తెలుగు దినపత్రికల మధ్య నెలకొన్న పోటీ మనకళ్ళముందు మెదులుతుంది.

ఈ పోటీకొచ్చిన నవలల్లో "మహా ప్రయాణం" అన్న నవల కూడా బావుంది. వామపక్ష పార్టీల్లో ఉత్పన్నమైన విభేదాలన్నీ సమసిపోవాలని, ఈ పార్టీలన్నీ సమైక్యంగా ఉంటేనే యేమైనా సాధించగలరన్న సందేశాన్నిచ్చిన నవల ఈ "మహా ప్రయాణం"

ఈ నవలలోని ప్రధాన పాత్ర నంది. ఇతడు ఒకప్పుడు వామపక్ష తీవ్రవాద పార్టీలో పనిచేసి అజ్ఞాతంలోకి వెళ్ళిన వాడు. ఇప్పుడు వృద్ధుడైపోయాడు. అతని శరీరంలోకి ఎన్నో జబ్బులు ప్రవేశించాయి. ఈ కారణం చేత అతడు యే పార్టీతోను సంబంధం పెట్టుకోకుండా తన శేషజీవితాన్ని గడపాలని నిర్ణయించుకుంటాడు. అయినప్పటికి అతనికి వామపక్షపార్టీల మీద అభిమానం కారణంగా ఒకప్పుడు తనతో పనిచేసిన వాళ్ళందర్నీ కలుసుకోవాలని తన ఇంటి నుండి ఒక్కడే బయల్దేరుతాడు. అతడు చేసిన ఈ ప్రయాణానికే రచయిత "మహా ప్రయాణం" అని పేరు పెట్టాడు. ఈ నవలలో కొందరు వామపక్షవాదుల మధ్యన జరిగిన చర్చలే ప్రధానంగా ఉంటాయి. నవల చివర్లో అమెరికాలాంటి పెట్టుబడిదారీ దేశాలను అభిమానించే వారిని కూడా ప్రవేశపెట్టాడు. ఈ నవలకు కథానాయకుడైన నంది నవల చివర్లో కోమాలోకి వెళ్ళిపోయేముందు తన చుట్టూ ఉన్నవాళ్ళందరికి ఒకమాట చెబుతాడు. కమ్యూనిస్టులందరూ ఐక్యం కావాలని చెప్పటమే కాకుండా, ఇప్పటి ప్రభుత్వ పెట్టుబడిదారీ అనుకూల విధానాలను మార్పించే స్థితిలో కమ్యూనిస్టులు వేరని చెబుతూ కనీసం ప్రజాస్వామ్య భావాలున్న అందర్నీ వామపక్షవాదులు కలుపుకొని పోరాటం చెయ్యాలి. ఇదీ ఈ నవల ద్వారా రచయిత ఇచ్చిన సందేశం అనుకోవాలి. ఈ నవలలో ప్రధానంగా చర్చలే తప్ప సంఘటనలు చాలా తక్కువ.

మొత్తమ్మీద ఈ పోటీకొచ్చిన చాలా నవలల్లో మన సమాజం ఎదుర్కొంటున్న యేదో ఒక సమకాలీన సమస్యని చిత్రించాలన్న ప్రయత్నం జరిగింది. నవలలకు మంచి రోజులు కావు అనుకుంటున్న తరుణంలో సిపిఐ(ఎం) పార్టీవారు ఈ పోటీని నిర్వహించి కొన్ని మంచి నవలల్ని వెలికి తీసినందుకు వారిని అభినందించాలి.

# పర్యాంతం



- జి.వెంకటకృష్ణ
9440154144

చారల చారల తెర లేచింది
చాళ్ళ చాళ్ళ పొలం మధ్యగా రైతును చూపింది
హళం అతని భుజమ్మీద
మెడచుట్టూ తుండుగుడ్డ
గళాన్ని బిగించిన వురిపట్టా అన్నట్టు.

ఆకాశంతో అతని అంతర్ముఖ సంభాషణకు
సంభావనగా మేఘం రాల్చిన నాలుగు బొట్లకు
సాచిన చేతుల్ని కళ్ళకద్దుకొని
జడ్డిగంలా మార్చుకొని - ఇదే ఆఖరు అనుకొని
బీజ భూమిని ఆవాహన చేస్తుండగా

ఎండిన నేల పగలబడి నవ్వింది
గుంజుకోవడానికొచ్చిన ఏ దుష్ట దృశ్యాన్నో చూసి
మరులుగొన్న కుక్కలా ఆకాశం మొరిగింది
ఇదంతా పాత కథే అన్నట్లు
తెలిపోతున్న కారుమేఘపు అంచుల్లో
కన్నీటి తెర మెరిసింది

*

ఆ రాత్రి ఎన్నో వుల్కలు రాలాయి
చినుకులతో పాటు పిడుగులూ పడ్డాయి
ఒకటి ఎండిన పంట కాలువ మీదా
యింకొకటి పాడుపడ్డ ఫ్యాక్టరీ మీదా
ఒరిగిపడ్డ పిట్టగూడు
కూలిపడ్డ బక్క ఆవు
చీకట్లో పొలంగట్టున చెట్టుకు వేలాడిన రైతు
ఫ్యాక్టరీ ముళ్ళు గేటుకు గుచ్చుకు చచ్చిన కార్మికుడూ - రైతు వారసుడూ
ఆహాహాకారాలూ ఆర్తనాదాల మధ్యా కెవ్వుమన్న పసిగొంతు
అప్పుడు భోరున కురిసిన దుఃఖంలో
అలజడిగా మారిన నాటకం

*

తెర తీసింది నాందీ ప్రస్తావనకూ
అసలు ప్రస్థానం తరువాయి
గద్దలు వాలాయి ఖద్దరు తొడుక్కుని
జోలెలు పట్టుకొని.
డేగలు వాలాయీ సూటూ బూటూ వేసుకొని
వలలు విప్పుకొని
పథకాల బుర్రకథలు పాడుతాయి
ఓట్లగాలాలు ఆడుతాయి
మన శవంతో మన వీధిలోనే
ఓదార్పులు వార్చుతాయి
ఓటూ నోటూ కులుకుతాయీ
ఓహోహో !
ఇక తెరముందు వాగ్ధాన మేఘాల దట్టంగా.

*

రెండో అంకం
నాటకంలో మహా నాటకం
ఉభయ సభల పర్వం
మాతకు చీరగుంజే దృశ్యం - ఆమె రైతు భార్యే అవశ్యం
పితకు టోపీ తొడిగే అంకం - జాతిని పీడించేవాడే ఖచ్చితం
పాత్రధారుల చేతుల్లోని అంతర్జాల సాధనంలో
అంగాంగ ప్రదర్శనం - ప్రజలమీదికి గుర్రాలు ఎక్కించడం
అభినయతారల నగ్ననృత్యం - ఆందోళనాకారుల
హర్తాల్ మీద లాఠీ విన్యాసం
ప్రజాస్వామ్యం బాగా పండి కుళ్ళింది అంటే
అధ్యక్షా ! పాత్రల వాకౌట్ !
పర్వం నిరంతర వాయిదా
నాటకం రసాభాస

*

మూడో అంకం
న్యాయాలయం
జడ్జి కళ్ళకు గంతలతో
న్యాయదేవత చేతిలో త్రాసు బదులు గొడ్డలితో
పేజీలు తిరుగుతున్న దస్త్రాలు
తేదీలు మారుతున్న వాయిదాలు
గొంతులు ఆరుతున్న సాక్ష్యాలూ
న్యాయ బాధితులు కుళ్ళుతున్న శవాలు
సత్యానికి పోస్టుమార్టం చేస్తున్న లాయర్లు
దేశంలోని ప్రతి రైతు దేహానికీ
ఒక తెల్ల గుడ్డా
ప్రతి కార్మికుడి దేహానికి - ఒక ఎర్రగుడ్డ
పరిహారం పంపిణీగా కోర్టుతీర్పు

*

అప్పుడొక పాత్ర ప్రవేశిస్తుంది
కాలం మడి చుట్టూ కంచెను దాటుకొని
త్రికాలంగా పడ్డ ముళ్ళ ముడులను విప్పుకొని
మంద నుండీ మందిని వెంటబెట్టుకొని
అతడే నాటకాన్ని మలుపు తిప్పాలనుకునే
ఔత్సాహికుడు
కంచెల సరిహద్దులు చెరిపేసే సాహసికుడు
చరిత్రను వుద్యమాల పరం చేసే నిర్వాహకుడు.
అతడే కొనసాగిస్తాడు అభినయాన్ని.....
తప్పక తెర దించుతాడు నాటకాన్ని.

# వర్తమాన సమాజ చిత్రణ




- ఆర్.ఆర్.జి

*గత ఇరవై ఐదు సంవత్సరాలుగా దేశ ఆర్థిక రాజకీయ సామాజిక రంగాలలో జనుల జీవితాలను కుదిపి వేస్తున్న ప్రపంచీకరణ ఇతివృత్తంతో వెలువడిన మొదటి తెలుగు నవలగా దీనిని భావించవచ్చు. నవీన్ కాలరేఖలు, చెదిరిన స్వప్నాలు, బాంధవ్యాలు వరుసలో సమకాలీన ఇతివృత్తంతోనే వచ్చిన ఈ ఏ వెలుగులకీ ప్రస్థానం నవలను కొనసాగింపుగా భావించవచ్చు.*

సంస్కరణలంటే ఏ రంగంలోనైనా పేరుకుపోయిన మురికిని స్తబ్దతను, స్వార్థాన్ని హానికరమైన వాటిని తొలగించేవి. ప్రజాశ్రేయస్సు లక్ష్యంగా జీవితాలను సులువు చేసే విధానాలు, చర్యలు అనుకోవాలి. కాని అమెరికా తదితర దేశాల ఆర్థిక వ్యవస్థకు దేశంలో ఉన్న పెద్ద పెట్టుబడిదార్లకు లాభాలార్జించి పెట్టే విధానాలను , సంస్కరణలు అనటం మభ్యపెట్టే ఒక వ్యాపార ప్రకటనగానే అనుకోవాలి. కాని ఈ సంస్కరణల వల్ల ప్రజలకు ఉపాధి, ఆదాయాలు పెరుగుతాయని ప్రభుత్వాలు ప్రకటిస్తున్నాయి. ఇంతకన్న ప్రజల ప్రయోజనాల్ని కాపాడే మార్గమే లేదన్నట్టుగా ప్రభుత్వాలు ఎలుగెత్తి చాటుతున్నాయి.

1991 నుండి భారతదేశంలో అమలులోకి వచ్చిన సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలు ప్రజల జీవితాలను ఏ విధంగా ప్రభావితం చేసిందీ చిత్రించిన నవల అంపశయ్య నవీన్ 'ఏ వెలుగులకీ ప్రస్థానం'

అధికోత్పత్తి కోసం వచ్చిన పంటల విధానాలన్నీ వ్యవసాయంలో అధిక పెట్టుబడుల ఆవశ్యకతను సృష్టించాయి. రైతు అప్పులు చేయకుండా వ్యవసాయం చేయలేని పరిస్థితి చాలాకాలంగా ఉన్నదే.

రైతు అప్పులు తెచ్చి పెట్టుబడి పెట్టి పంటలువేయటం ఒక జూదంతో సమానమైంది. ఎరువులు, విత్తనాలు, పురుగుమందులు అన్నీ మార్కెట్ నుండి తెచ్చుకోవలసినవే. పంటలు చేతికందినా అప్పులు తీరే యోగం లేదు. మార్కెట్టులో ధరలు వ్యాపారులకే అనుకూలంగా ఉంటాయి. వ్యవసాయ రంగానికి సంబంధించిన పరిస్థితిని ఈ నవల చిత్రించింది.

నవల మొత్తం ఇందులోని ప్రధాన పాత్ర నరేందర్ చుట్టూ తిరుగుతుంది. ప్రయివేటీకరణ సరళీకరణాలు తన విధానాలుగా కేంద్రప్రభుత్వం ప్రకటించిన 1991తో ప్రారంభించి, అది మనుషుల జీవితాల్లో తెచ్చిన మార్పులను అనేక పాత్రల ద్వారా రచయిత చిత్రించాడు.

ఒకప్పుడు తనస్థాయిలో వ్యవసాయాన్ని కొంత లాభదాయకంగా చేసిన అయిలయ్య పత్తి పంటలో వచ్చిన వరుస నష్టాలతో ఆర్థికంగా కుంగిపోయి ఆత్మహత్యకు పాల్పడ్డాడు.

చిన్న వ్యాపారాలు చేసుకునే వారు కూడా ఏ విధంగా దిగజారింది రచయిత చిత్రించాడు. రిటెల్ రంగంలోని రిలయన్స్, మోర్ వంటి పెద్ద పెద్ద వ్యాపార సంస్థలు ప్రవేశించటంతో చిన్న వ్యాపారస్థులే కాక, కూరగాయలు తదితరాలు అమ్ముకునే వారు సైతం అమ్మకాలు తగ్గి ఆర్థికంగా దెబ్బతిన్నారు. కొద్దిమంది అనేక మార్గాలలో నిలదొక్కుకునే ప్రయత్నం చేసినా అది అందరికీ ఫలించలేదు.

తన స్వగ్రామంలో సెజ్ ఏర్పాటు కోసం పెట్టుబడిదారులు

భూములు కొనే ప్రయత్నాలు ప్రారంభించారని తెలిసి, నరేందర్ ఊరికి వెళ్ళి రైతులతో మాట్లాడుతాడు. కొందరికి భూములు అమ్ముకోవడం ఇష్టంలేదని తేలుతుంది. ఐనా పెరిగిన భూములు ధరలను చూసి కొందరు అమ్మడానికే సిద్ధపడతారు.

మనుషులందరి మీద మాత్రమే కాదు, పెట్టుబడిదారుడు పంచభూతాలపై కూడా ఆధిపత్యం సాధించేత వరకు విశ్రమించడు. దేశంలోని వనరులు క్రమేపి పెట్టుబడి ఆధిపత్యం కిందకు వెళ్లే దిశలోనే ఈ ఆర్థిక విధానం పయనిస్తుంది.

దేశ, విదేశ కంపెనీలకు, భూమి, నీరు వంటి వసతులు, ప్రభుత్వానుమతులు, ప్రభుత్వానికి చెల్లించాల్సిన పన్నుల నుండి మినహాయింపులు, వారు అర్థాంతరంగా పరిశ్రమలు లేదా కంపెనీలు మూసి వేసినా ఏ అభ్యంతరాలుండవని హామీలు ఇవన్నీ విచక్షణారహితంగా ఇచ్చివేసే ప్రభుత్వాలు, ఇంత దీనస్థితికి దిగజారి దేభిరించే ప్రభుత్వాలు, కోట్లాది ప్రజల క్షేమాన్ని దృష్టిలో ఉంచుకునే ఇవన్నీ చేస్తున్నామా అంటే కాదనేది సుస్పష్టం. కార్పొరేట్ సంస్థల డబ్బులు ప్రచారాలతో ఎన్నికయ్యే ప్రభుత్వాలు కార్పొరేట్లకే అనుకూలంగా ఉంటాయనేది జగద్విదితం. ఏ ఎన్నికల్లోనైనా తమ ప్రయోజనాలు నెరవేరుతాయని ఆశించే ప్రజలు మోసపోకతప్పదు.

వృద్ధాప్య సమస్యలే కేవలం ఆర్థికానికి చెందినవి మాత్రమే కాదు. వాటిలో భావోద్వే సమస్యలు కూడా ఇమిడి ఉన్నాయి

అసలు పెళ్లి తర్వాత కొడుకు కోడలు అత్తమామలతో నివసించడమే ఈ భావోద్వేగ వైరుధ్యాన్ని సృష్టిస్తున్నది.

నవలలో అనేక చోట్ల పబ్లిక్, ప్రయివేటు రంగాలు పెట్టుబడులు, పరిశ్రమలను గురించిన చర్చ ఉంది.

మనిషి తన స్వార్థానికే శ్రమిస్తాడు. అందుకే ప్రభుత్వం రంగ సంస్థలన్నీ ఎదుగూ బొదుగూ లేకుండా నాష్టాల ఊబిలో కూరుకున్నాయి అని ఒక చర్చ నవలలో కనిపిస్తుంది.

అయితే దానిని పరిపాలన లేదా నిర్వహణ లోపంగా అర్థం చేసుకుని, దానిని సవరించి చక్కదిద్దే సామర్థ్యాన్ని ప్రభుత్వాలు ముందుగా ఊహించి సమకూర్చుకోకపోవడం వలననే అని అనుకోవాల్సి ఉంటుంది.

కాని దీనిని సాకుగా చూపి, ప్రయివేటు రంగానికి, ప్రజలందరికీ చెందిన సహజ వనరులను విచ్చలవిడిగా దోచిపెట్టలేము కదా!

ప్రపంచీకరణ విధానం భద్రంగా కొనసాగడానికి, అది ఆధారపడదగిన ఒక వినియోగవర్గాన్ని - మధ్య తరగతిని - విస్తారంగా సృష్టిస్తుంది. మధ్య తరగతి ఎప్పుడూ తనకన్నా కిందివారి పేదరికం గురించికాక, పై స్థాయిలో ఉన్న ధనిక వర్గాన్నే ఆదర్శంగా తీసుకొని, పైకెగబాకడానికి ప్రయత్నిస్తుంది. పెట్టుబడి సృష్టించే వస్తూత్పత్తికి వినియోగదారునిగా ఇది ఉపయోగపడుతూ ఆ వ్యవస్థ సానుకూలంగా ఉంటుంది.

వీరేశ్ పేదరికం నుండి మధ్య తరగతికి ఎదిగి, కార్లను మార్చి మార్చి కొనగల ఆర్థిక శక్తిని బ్యాంకుల నుండి సమకూర్చుకుంటాడు. బ్యాంకులు కూడా రైతుల రుణాలకన్నా మధ్యతరగతి వినియోగ వస్తువులకోసం తీసుకునే రుణాలనే సులభంగా ఇస్తున్నాయి. ఇదంతా పరిశ్రమలు తమ ఉత్పత్తులను త్వరగా అమ్ముకోడానికి ఉపయోగపడుతుందే తప్ప, ఇదేదో వినియోగదారుల మీద ప్రేమతో కాదు రుణాలు ఇచ్చేది.

20వ శతాబ్ది మధ్య భాగం నుండే సమిష్టి కుటుంబాల విచ్ఛిన్నం కొనసాగింది. ప్రపంచీకరణ బాగా పెరిగింది. సమిష్టి కుటుంబాల అప్రధానమైపోయాయి.

ఈ నేపథ్యంలో ఆర్థికంగా ఆదాయాలు లేని వృద్ధులైన తల్లిదండ్రులను కొడుకుల ఆదరించటం సమస్యాత్మకం అయింది.

ఆర్థికంగా పుంజుకున్న వీరేష్ సైతం తల్లిదండ్రులను ఓల్డేజ్ హోమ్‌లో చేర్పించాడు. వీరు ఇంట్లోనే ఉంటే తన భార్యకు వీరికి ముద్ద గిట్టదని, ఓల్డేజ్ హోంలో ఉంచడమే పరిష్కారంగా భావించాడు.

అభిషేక్ తల్లి తన కోడలితో ఏర్పడ్డ వైరుధ్యంతో కొడుకు నుండి సానుభూతి లోపించటంతో ఆమె భరించలేకపోయింది. వృద్ధాశ్రమంలో చేర్చుతానన్న కొడుకు మాటను తిరస్కరించిన ఆమె ఒక మెస్‌లో పనికి కుదిరి, వారం తిరగకుండానే అవమానంతో ఆత్మహత్య చేసుకుంటుంది.

వృద్ధాప్య సమస్యలు కేవలం ఆర్థికానికి చెందినవి మాత్రమే కాదు. వాటిలో భావోద్వేగ సమస్యలు కూడా ఇమిడి ఉన్నాయి

అసలు పెళ్లి తర్వాత కొడుకు కోడలు అత్తమామలతో నివసించడమే ఈ భావోద్వేగ వైరుధ్యాన్ని సృష్టిస్తున్నది.

అత్త తన కొడుకుతో గల సంబంధాన్ని యధాతథంగా కొనసాగించుకోవాలనుకుంటుంది. కాని కోడలు తన స్వేచ్ఛాయుత కుటుంబ ప్రణాళికలో ఆమెకు స్థానం కల్పించ నిరాకరిస్తుంది. కొడుకు కోడలు అత్తమామలతో కలిసి ఉండడమే ఈ వైరుధ్యానికి దారి తీస్తుంది. కాబట్టి న్యూక్లియర్ కుటుంబాలే అత్తాకోడళ్ల వైరుధ్యానికి తావు లేకుండా చేస్తాయి. వివాహానంతరం కొడుకు కోడలు వేరుగా నివసించటమే ఎంతో వేదనను ఘర్షణను నివారిస్తుంది.

# కొన్ని ఊహలకు అక్షరాల బొమ్మలు

- డా.సి.హెచ్.వేంకటరాజా రెడ్డి
8985804576

చీకటి తల పగిలింది
శ్రమజీవికి పని తగిలింది
దౌష్ట్యం కష్టాన్ని దోచుకుంది
అలసటకు పాపం ఆకలే మిగిలింది

ధర్మం కనబడదు
అయినా వెతుకుతూనే ఉన్నాం
గాలీ కనబడదు
అయినా శ్వాసిస్తూ బ్రతుకుతునే ఉన్నాం

తీరం అడ్డంగా ఉందని
కోపంగా కదులుతోంది సముద్రం
వెనక్కి వచ్చినా విశ్రమించకుండా
మళ్ళీ ప్రయత్నిస్తూనే ఉంది
దాని నడకలో జోరు తప్ప
ఇంకేమీ కనిపించదు



ఆకలి కిరాతకంగా
హింసిస్తోంది దారిద్ర్యం
దాని నరాల్లో హోరు తప్ప
ఇంకేమీ కనిపించదు

మీకు నా రక్తాన్ని ఇస్తాను
నాకు మీ గాయాలివ్వండి
మీకు నా గుండెనిస్తాను
మీరు మీ చీకట్లని వెలివేయండి

---

వివాహానంతరం అత్తమామలకు దూరంగా ఉండే యువ దంపతుల మధ్య కూడా అనేకానేక సమస్యలు ఉత్పన్నమై శాంతి కరువై వారు ఎంతో వేదనను అనుభవిస్తున్నారు.

విష్ణు కొడుకు శ్రీకాంత్‌కు ఇంటర్నెట్ ద్వారా పరిచయమైన శ్రావ్యతో వివాహం జరుగుతుంది. కాని భార్య విపరీతమైన మాటలను, నడవడిని తట్టుకోలేక శ్రీకాంత్ ఆత్మహత్య చేసుకుంటాడు.

అరవింద్ రమ్యలకు సంతానం కలుగదు. భర్తలోని లోపం వల్ల పిల్లలు కలగటం లేదని తెలుసుకున్న రమ్యలో సంతాన కాంక్ష అధికమౌతుంది. పసిపిల్లలనెవరినైనా దత్తత తీసుకుని పెంచుకుందామన్న భర్త ప్రతిపాదనను వ్యతిరేకిస్తుంది. డోనర్ స్పెర్మ్‌తో కనడానికి సిద్ధపడిన రమ్య ప్రతిపాదనను అరవింద్ వ్యతిరేకిస్తాడు. దీనితో రమ్య తన తల్లిదండ్రులతో కలిసి భర్తపై పోలీసులకు కట్నం వేధింపుల ఫిర్యాదు చేస్తుంది.

ఉమేష్ చేస్తున్న ఉద్యోగంలో నైట్‌డ్యూటీస్ ప్రాబల్యం వల్ల అసంతృప్త కాపురం సమస్యల్ని సృష్టిస్తుంది.

ప్రపంచీకరణ నేపథ్యంలో కుటుంబ సంబంధాలు మరింత వేగవంతంగా విషమిస్తున్నాయి.

అంతర్జాతీయంగా అమెరికా ఆర్థిక సైనిక ఆధిపత్యం ధోరణులకు ప్రతి చర్యగా జరిగిన టెర్రరిస్టు చర్యలు, 9/11 ఈ నవలా కథనంలో చిత్రించబడినాయి. అమెరికా వరల్డ్ ట్రేడ్ ఆర్గనైజేషన్ టవర్లను టెర్రరిస్టులు విమానాలతో కూల్చివేసిన ఘటనతోబాటు మరోచోట ముంబై నగరం మీద 2008లో పాకిస్తాన్ టెర్రరిస్టులు జరిపిన దాడి చిత్రించబడినాయి.

ప్రపంచీకరణ కథనంలో సమకాలీనంగా జరిగిన 2001, 2009 సాధారణ ఎన్నికలు, రాజకీయ అంశాలు నవలలో ప్రస్తావనకు వచ్చాయి.

ఈ నవలలో ప్రత్యేక తెలంగాణా ఉద్యమం నాలుగు అధ్యాయాల్లో ప్రస్తావించబడింది. ప్రపంచీకరణ ఇతివృత్తంతో పెద్దగా సంబంధం లేనప్పటికి సమకాలీనత కారణంగా ఈ అంశం నవలలో చోటు చేసుకున్నది. కాని దీనిని వేరే ఒక పూర్తి నవలగా రాసి ఉంటే తెలంగాణ ఉద్యమ స్వరూప స్వభావాలు ఇంకా స్పష్టంగా కనిపించేవి.

గత ఇరవై ఐదు సంవత్సరాలుగా దేశ ఆర్థిక రాజకీయ సామాజిక రంగాలలో జనుల జీవితాలను కుదిపి వేస్తున్న ప్రపంచీకరణ ఇతివృత్తంతో వెలువడిన మొదటి తెలుగు నవలగా దీనిని భావించవచ్చు

నవీన్ కాలరేఖలు, చెదిరిన స్వప్నాలు, బాంధవ్యాలు పరుసలో సమకాలీన ఇతివృత్తంతోనే వచ్చిన ఈ ఏ వెలుగులకీ ప్రస్థానం నవలను కొనసాగింపుగా భావించవచ్చు.



# అరి బెమ్మ దేముడా

- మీనాక్షి శ్రీనివాస్

9492837332

"ఇదిగో ... వదినగారు ... మీకీ సంగతి తెలుసా?" గోడవతల నుంచి గోల గోలగా అడిగింది ఆండాళ్ళు.

"వచ్చే వచ్చే .... "అవతల మాంచి రసకందాయనంలో వున్న సీరియల్ మధ్యలో ఈవిడ గోల ఏమిటో? కొంప మునిగి పోయినట్లు"... విసుక్కుంటూ బయటకు వచ్చింది అఖిలాండేశ్వరి ... ఈవిడని ఉరి తీసినా పాపం లేదన్నంత కోపంతో".

వదిన గారూ ... మీకీ సంగతి తెలుసా? టీ వీ, పేపర్లూ ఒహటేమిటి ...అట్టుడికి పోతోందంటే నమ్మండి ... ఎక్కడ చూసినా ... ఈ సంగతే ....." అసలు సంగతి చెప్పకుండా ... ఇలా సస్పెన్స్..... సెన్సేషన్ ... క్రియేట్ చెయ్యడంలో అన్ని చానెల్స్ కి ఈవిడే గురువంటే నమ్మండి.

"విషయం చెప్పండి వదినా ... అవతల నాకు బోలెడంత పని వుంది ... " విసుగ్గా అంది అఖిలాండేశ్వరి.

"ఏమిటో? ...ఈవిడ వెలగబెట్టే ...రాచకార్యం.....ఎవరికి తెలియదనీ? ... ఆ పిల్ల వెధవలిద్దరినీ ... హాస్టల్ లో పడేసింది చదువు చట్టు బండలూ అని, ఆ మొగుడు ముండావాడేమో ... ఊరు తెల్లారకుండా కంపెనీకి చక్కా పోతాడు.....వాడి తిండి ... తిప్పలూ అన్నీ అక్కడే. ఈవిడగారేమో ... లేచింది మొదలు పడుకునేదాకా ... ఆ ఏం పడుకోడంలేస్తురూ అర్థరాత్రో ....అపరాత్రో .. ఆ టీ వీ వాళ్ళు ... ప్రసారాలు ఆపేసే దాకా చూసి ఇక తప్పదన్నట్లు, కాసేపు పడుకోవడమే. తర తమ బేధాలు, భాషాబేధాలు ఏమీ లేవు ... తెలుగు, తమిళ కన్నడ, హిందీ ,,......ఆఖరికి ఆ గుజరాతీ సీరియల్స్ కూడా వదిలిపెట్టదు ... అన్ని చానెల్స్ మార్చి మార్చి చూస్తుంది, పాపం ... ఆ పనిమనిషికి జాలేసి ....కాస్త తిండి తిప్పలూ ... చూస్తుంది.

"ఏమిటి ..వదినా ... అంత కంగారు పడి పోతున్నారు ... కొంపదీసి ... ఏ మంత్రి అయినా ....పోయారా ఏం? ఖర్మ ఇంక ... టోయ్ ... టోయ్ .....య్ ... మంటూ ఆ దిక్కుమాలిన ... ఏడుపుగొట్టు సంగీతం వేసేస్తారు ... టీ వీ లో అన్ని ప్రోగ్రామ్స్ ఆపేసి " ఏంతో ... అనర్థం జరిగి పోతోందన్న ...కంగారు ఆవిడ గొంతులో. "ప్చ్ ....అదేమీ కాదోదినగారూ .. మీరు గమనించలేదా ఏమిటీ? మీరు చూసే సీరియల్స్ కింద కూడా స్లైడులు వేస్తున్నారు, మీరు సీరియల్స్ లో మునిగి పోయి చూసుందరు" వెటకారంగా అంది ఆండాళ్ళు.

"అబ్బా ... విషయం చెబుదురూ ... అవతల ..వందన ....ప్రేమించిన వాడితో వెళ్ళిపోతుందా? లేక పెళ్ళికి కట్టుబడి ...ఆ మొగుడు ముండా వాడితో ఉండిపోతుందా? ....సస్పెన్స్ మిస్ అయిపోతా ... ఏదో లక్కీ గా యాడ్ వచ్చింది కదాని లేచొచ్చా ...." విసుగు స్పష్టంగా కనబరిచింది అఖిలాండేశ్వరి.

''తిరుపతిలో ....వెంకన్న బాబు మాయం అయిపోయాడట ... ఒక్క తిరుపతి ఏమిటీ? ... భద్రాద్రి రామన్న, శ్రీశైలం మల్లన్న, షిరిడి సాయి ఒక్కరని ఏమిటీ? దేశంలో చిన్నా చితకా ... అన్ని గుళ్ళల్లో దేముళ్ళూ ... మాయం అయిపోయారట .... "చూస్కో నా రాజా " ఛానల్ లో లైవ్ టెలికాస్ట్ ఇచ్చేస్తున్నారు. .తిరుపతి ...ప్రధాన అర్చక స్వామితో ముఖాముఖి ... కానీ గర్భ గుడి మాత్రం చూపించడం లేదండోయ్....." గుక్క తిప్పుకోకుండా చెప్పేసింది ఆండాళ్ళు.

" హేమిటీ? ....." సీరియల్స్ కంటే ...ఇంటరెస్టింగ్ విషయంలా అనిపించి ..ఒక్కసారిగా ...ఎలర్ట్ అయి పోయింది అఖిలం.

" అమ్మయ్య ... ఈ సీరియల్స్ పిచ్చి దాని బుర్రకెక్కింది విషయం'' ఆనందంగా నిట్టూర్చింది ఆండాళ్లు.

"ఏమిటో ....మా ఇంట్లో కరెంటు ..ఇప్పుడే పోయి చావాలా?.సమయానికి ....ఎవరూ ఇంట్లో కూడా లేరు........" రాకూడని కష్టం వచ్చిందన్న ధ్వని వినపడిందా గొంతులో..



"రండి ... వదినా ... మా ఇంట్లో ... ఇన్వర్టర్ ఉందిగా ....ఇక్కడ చూద్దాం....అయినా దేముడి నగలూ ,నాణ్యాలు,, భూములూ....పు త్రా ....గత్రా స్వాహ ..చేస్తున్నారు ....చాలలేదు కాబోలు ... .ఇప్పుడు ఏకంగా దేముడి విగ్రహాలకే ఎసరు పెట్టేస్తున్నారులా వుంది....కలికాలం" విస్తుపోయింది.

"అయ్యో .. వదిన గారూ .. విగ్రహాలు ఎత్తుకుపోవడం అయితే అందులో అంత ఆశ్చర్యం ఏం ఉందీ కనకా... దేముళ్ళు సమ్మె ... చేస్తున్నారట .....సమ్మె "

"హేమిటీ? ... దేముళ్ళు ... సమ్మె" ఫక్కు మంది అఖిలం...

" ఈ టీవీ వాళ్ళకీ ... పేపర్ వాళ్ళకీ ప్రచారానికి ... ఇంకో వార్త ఏందొరకలేదటనా ... మరీ కాకపోతే ... దేముళ్ళేమిటి సమ్మె చెయ్యడం .. ఏమిటి? .....వెటకారం ...కాకపోతే ....అలా అని ఎవరు చెప్పేరుట వీళ్ళకి ... ఆ దేముళ్ళు కలలో కనబడి చెప్పేరుటా? లేకపోతే ఇలలో నిలబడి చెప్పేరటా? వీళ్ళకు ... ఎకసెక్కంగా అంది అఖిలాండేశ్వరి .

" మీరు .. మరీ .. అలా తీసి పారేయకండి వదినా .. దేశం అంతా అట్టుడికి పోతోంటే ... అందరూ ... వెర్రాళ్ళా .. ఏం? ఉండండి ... తలుపేసి ... అటు చక్కా వస్తాను ... ఏం జరిగి పోతోందో ఏమిటో?" మరో మాటకి ఆవకాశం ఇవ్వకుండా దఢేల్ మని పెరటి తలుపేసి, ఒక్కంగలో పక్కింటికి వచ్చి పడింది ... ఆండాళ్ళు.

ఈ లోపు "చూస్కో నా రాజా " పెట్టింది అఖిల.

"ఇప్పుడు మీరు తిరుమల తిరుపతి ప్రధాన అర్చక స్వామితో ముఖాముఖీ .....చూస్తారు .. చిన్న బ్రేక్ తరువాత....." చూస్తూనే ఉండండి "చూస్కో నా రాజా " స్టైలుగా.... ఊగిపోతూ చెప్పింది యాంకర్ పిల్ల.

"నమస్కారం ... అర్చక స్వామీ ... అసలు .. ఏం ...జరిగింది? .....ఎలా జరిగింది? ...అనే ఉత్కంటతో మా ప్రేక్షక లోకం యావత్తూ ... విభ్రాంతిలో వుంది దయచేసి ... కాస్త ... ఏం జరిగింది? ...ఎలా జరిగింది? ...అనే ...విషయ వివరణ కాస్త ఇస్తారా? "

" అమ్మా ... నేను తెల్లవారు ఝామున, నాలుగు గంటలకే ... స్వామికి సుప్రభాత సేవ ......

"ఆ వివరాలన్నీ ... అక్కర లేదండి ....స్వామీ ఎలా మిస్ ... అదే ... ఎలా ... మాయం అయిపోయారు ...దానికి మీరెలా ప్రతిస్పందించారు ... అది ఎవరైనా దొంగిలించారా? లేక ప్రతి పక్షాల హస్తం ఉందా? లేక విదేశీ కుట్ర ఏదైనా ఉందా? అన్న కోణంలో దర్యాప్తు జరుగుతోందా? "

"అమ్మా ....అలాంటి దేమి లేదు....స్వామి ......

''అర్చక స్వామిగారు ....స్వామివారి విగ్రహాలకి తోడుగా అమ్మవారి విగ్రహాలు కూడా , వాటి నగలూ .. గత్రా కూడా కనబడటం లేదా? ....సెక్యూరిటీ హస్తం ఏమైనా ఉందా? అన్న ఎంక్వయిరీ .....జరుగుతోందా? "

"అమ్మా ... యిది మాయం చెయ్యడమో ....లేక సంగ్రహించడమో కాదు ...స్వామీ ఆగ్రహించి ......

"దీని వెనుక ...రూలింగ్ పార్టీ హస్తం ఏమైనా ఉందా? ......లేక ....మత .. కల్లోలాలు సృష్టించడానికి .....

"తల్లి ... నన్ను చెప్పనిస్తారా? .లేక ...మీకు తోచిన విధంగా మీరు రకరకాలుగా చెప్పుకుంటూ పోతారా? .....కోపంగా చూస్తూ ...దీనంగా అడిగాడు అర్చక స్వామి.

"భలే వారే ... మీరే చెప్పండి ... ప్రేక్షక లోకం చాలా ఉత్కంటతో చూస్తున్నారు ... మీరు చెప్పండి, మరిన్ని వివరాలతో మీ ముందుకు వస్తుంది మా "చూస్కో నా రాజా " ... బ్రేక్ తరువాత.

"అయ్యో దీని ముఖం తగలెయ్య ... మరిన్ని వివరాలేమిటి? ... దీని పిండా కూడు ... ఇప్పటి దాకా ఏం వివరాలు తెలిసి చచ్చాయి కనక .....

"ఆలయాల్లో ... అంతర్ధానాలు ... అందులో అంతరార్ధాలు, వివరాల్లోకి వెడదామా ... ఇప్పుడు మీకు మరిన్ని వివరాలు అందచేస్తుంది ... తిరుమల నుండి మా శుభ ... .శుభా ... నువ్వు చాలా చాక చక్యంతో బోలెడన్ని వివరాలు మా ప్రేక్షకులకు అందిస్తున్న విధానం చాల బాగుంది ... ఇదే జోష్‌తో మరి మిగతా వివరాలు ... అందిస్తావా? ఓవర్ టు శుభ.

"ఆ అర్చకస్వామీ గారు ... అసలు దేముడు తప్పిపోయాడా? , లేక ఎవరయినా కిడ్నాప్ ... ఐ మీన్ ఎత్తుకు పోయారా? ...లేక గుడిని విడచి ... చెప్పాపెట్టకుండా పారిపోయాడా? అన్న విషయాన్ని మీరెలా ధృవీకరిస్తున్నారు?

"అమ్మా, కాసేపు మీరు మాట్లాడకుండా నన్ను చెప్పనిస్తే ... చాలా ముఖ్యమైన విషయాలు చెబుతాను దీనాతిదీనంగా అడిగాడు .

"ఆ ....ఆ .... చెప్పండి .... చెప్పండి ....దేముడు..........

"అమ్మా ........"వారింపుగా ... అర్థిం పుగా ... అర్చకుడు

"ఆ ...ఆ ... నేనిక మాటాడను ... మా ప్రేక్షకులు ఎంతో ....ఉత్కంట తతో చూస్తున్నారు .....చెప్పండి ...చెప్పండి."



"ఆలయ ప్రధాన అర్చకుడిగా నేనీ విషయాన్ని ధృవీకరిస్తున్నా ....దేముడు ....పారిపోలేదు, లేచిపోలేదు.....ఎవరూ ఎత్తుకు పోలేదు.....దేముడు ....“సమ్మె” చేస్తున్నాడు. ఏకబిగిని చెప్పేసి ఊపిరి పీల్చుకున్నాడాయన.

"వాట్? సమ్మె ... యు మీన్ స్ట్రైక్ ... చేస్తున్నాడా?... ఆ విషయం మీరెలా ధ్రువీకరి స్తున్నారు? మరి సమ్మె నోటీసు ఏదైనా ఇచ్చేడా? ముఖమంతా పళ్ళు చేసుకు అడిగింది యాంకర్.

"గర్భగుడి లోపల గోడ మీద సువర్ణ అక్షరాలతో లిఖింపబడి వుంది ...మరి దానిని నోటీసు అంటారో....యింటిమేషన్ అంటారో....ఇంకేమంటారో?"

"సువర్ణ అక్షరాలూ ... యు మీన్ ... బంగారపు అక్షరాలూ... జూమ్ ద కెమెరా ... చూడండి ... గర్భగుడిలో స్వామీ వారి విగ్రహం వెనుక గోడ మీ ద ... ఎంత ముద్దుగా ...లల్లీగా మెరిసిపోతూ ఉందో...ఆ నోటీసు ......"

"అమ్మా ... అది నోటీసు ..... మరోటో కాదమ్మా ..... స్వామివారు స్వయంగా ...... వ్రాసిన .........

"మీరు చూసారా? అంత ఖచ్చితంగా ఎలా చెబుతున్నారు? ... అది దేముడే వ్రాసాడని ? బాణంలా దూసుకొచ్చింది ఆ ప్రశ్న.

"రాత్రికి రాత్రి ... ఆహా ... రాత్రికి రాత్రి కూడా కాదు ... కేవలం కొన్ని గంటల వ్యవధిలో అలా బంగారు ...అక్షరాలు గోడకి తాపడం చెయ్యడం ... అదీ ... ఆలయం తలుపులు వేసి వుండగా ..... అది ... మానవమాత్రుల వ ల్ల అయ్యే పని కాదు"

భక్తిగా చెంపలు వేసుకున్నాడాయన .

"మాకు జరుగుతున్న ... అన్యాయాలకు ..... అక్రమాలకూ నిరసనగా ..... నిరవధిక సమ్మె చేయ తలపెట్టాం " ఇట్లు ....వెంకటేశ్వర స్వామి.

"చూసారుగా ... ఇది ...... మా కెమెరా ట్రిక్ ... లేక గ్రాఫిక్స్ ఎంత మాత్రం కాదు ... మరిన్ని వివరాలతో మీ ముందుకొస్తుంది మీ "చూస్కో నా రాజా" ఛానల్ .....బ్రేక్ తరువాత ..... టింగ్ ... టింగ్

* * *

బ్రహ్మా లోకంలో అంతా ఆసీనులై వున్నారు. బ్రహ్మా నాలుగు తలలూ పట్టుకు కూర్చున్నాడు .వేంకటేశ్వరుడు, విష్ణుమూర్తి , రాముడు, కృష్ణుడు, మారుతి ,సాయి .... ఒక్కరనేమిటి అంతా అక్కడే వున్నారు.... ..దేవదేవుళ్ళంతా ఆవేశంగా ,గోలగోలగా మాట్లాడేస్తున్నారు.

"నాయనలారా .....మీరు కాసేపు శాంతించండి ...నా మాట వినండి ... నాలుగు ముఖాలతో ... నలువైపులా బ్రహ్మా చేస్తున్న అభ్యర్ధన అరణ్య రోదనమే అయ్యింది.

"నాయనలారా ...మీరంతా దేవదేవుళ్ళు ....లోకరక్షకులు, లోకంలో నీతి , న్యాయం, ధర్మం, గట్రా నాలుగు పాదాల మీదా నడిపించాల్సిన మీరే ఇలా ..."సమ్మె" అనడం విడ్డూరం గానే కాదు బ్రహ్మాప్రళయంగా వుంది ... అసలు మీ సమ్మెకు కల కారణం ఏమిటి? సృష్టి లయ కారకులమైన మనం ఇలాంటి తొందరపాటు నిర్ణయం ఎందుకు తీసుకున్నట్లు?" ఆక్రోశించాడు బ్రహ్మ.

"ఎంత దేముళ్లమైనా మా సహనానికి హద్దులున్నై బ్రహ్మదేవా ... నోరువాయి లేని దేముళ్ళం కదా ,రాతి బొమ్మలం కదాని ఎంతటి దురాగతాలకు, నైచ్యానికి వడిగడుతున్నారు ఈ నరాధములు ... ఎన్నాళ్ళని ... ఎంతకని సహించాలి వారి దురాగతాలు." మూకుమ్మడిగా అరిచారు.

"నాయనలారా ...ఇది భూలోకపు అసెంబ్లీ కాదు, అలా ...... గోలగోలగా అరుచుకుందుకు ... శాంతించండి, ఒక్కొక్కరుగా మీ మీ వాదనలు, మనోగతాలు సెలవివ్వండి, అయినా సామాన్య మానవుల్లాగా మనమూ ప్రవర్తిస్తే, మన

ఔచిత్యమేముంది. ఈ సమ్మెలు, గలాటాలు మనవంటి సురలకు తగవు. .నాయనలారా మీరంతా దేవదేవుళ్ళు ....లోకంలో నీ తి , న్యాయం , ధర్మం వగైరా నాలుగు పాదాలా నడిపించే మీరే మీరే యిలా సమ్మె అనడం బ్రహ్మ ప్రళయంగా తోస్తుంది ... అసలు మీ నిర్ణయానికి కల కారణం ఏమి? వాసుదేవా, సకల జగత్తునూ నడిపించే మీరు, లయ కారుడైన పరమశివుడు, ఇలాంటి తొందర పాటు నిర్ణయం తగునా? దయ చేసి మీమీ స్థానాలకు తరలిపొండు ... లోకాలికి విపత్తు కలిగించే తొందర పాటు చర్య తగదు." ఆక్రోశించాడు

" నీకేమయ్యా ... పేరుకు సృష్టికర్తవు ... పెద్ద బ్రహ్మవు కానీ, నీకో గుడా ....గోపురమా? నగలా, నాణ్యాలా? మణులా మాణ్యాలా?భూలోకపు రాష్ట్రపతిలా నామమాత్రపు అధికారం ...... హూ ......" హూకరించాడు వేంకటాచలపతి.

''ఎంత మాట అన్నావు వేంకటాచలపతీ ... చతుర్ముఖుడనన్న గౌరవమైనా లేకుండా ..." బాధగా అన్నాడు బ్రహ్మ.



" నిన్ను ఒక్క చిన్న మాట అన్నందుకే అంత బాధపడిపోతున్నావే, మరి ఆ మానవాధములు ... ఎన్ని రకాలుగా బాధిస్తున్నారో, వేధిస్తున్నారో మమ్మల్ని, ఎన్నాళ్ళని భరించమంటావ్? సహించమంటావ్? ఆక్రోశించాడు తిరుమలవాసుడు.

"ఎంత దేముళ్ళ మైనా ...మా సహనానికి హద్దులున్నాయి బ్రహ్మ దేవా ... నోరు వాయి లేని ... రాతి బొమ్మలుగా మమ్ము భావించి ... ఎంతటి నైచ్యానికైన దిగజారుతున్న ఈ నరాధముల ఘాతుకాలని ఎన్నాళ్ళని......ఎంతకని సహించాలి తండ్రీ " మూకుమ్మడిగా అరిచారు .

మచ్చుకి కొన్ని చెబుతా ఆలకించు ... గుడినీ గుడిలో లింగాన్ని మింగే దురాత్ములు, రోజు రోజుకీ పెచ్చుమీరి పోతున్నారు ....వారి ఆగడాలకి దురాగతాలకీ అంతే లేదు ... ఒక పక్క వారి కోరికలు, మొక్కు బడులు .....అన్నీ మొక్కుబడిగానే. మనస్ఫూర్తిగా ఆర్తితో ధ్యానించేవాడు కాని, భక్తితో పూజించేవాడు కాని దుర్భిణి వేసి చూసినా కన బడటం లేదు. పాప ప్రక్షాళనకు నగలు, కానుకలూ చేయించే వాడొకడైతే, రెండవ కంటికి తెలియకుండా వాటిని తస్కరించి నకిలీ నగలతో మమ్మల్ని అలంకరించే రాలుగాయి ఇంకొకడు ... లెక్కా పత్రం లేక ...అడిగేవాడు లేనివి కొన్నయితే .....దొంగ లెక్కలు చూపేవి కొన్ని వంటి మీద నగలు వలుచుకునేది కొందరైతే,వాటిని నకిలీ నగలతో నింపి అసలువి తాకట్టు పెట్టె అతి తెలివి పరులు కొందరు. ఇంకా కొందరు ప్రబుద్ధులు పంచ లోహ విగ్రహాలని పరాయి దేశాలకి తరలించే వారింకొందరు. అంతేనా ...ఆఖరికి పెట్టే నైవేద్యాల్లో కూడా కల్తీ .....ఛ ...ఛ ......" ఆవేశ పడ్డాడు గోవిందుడు .

"పోనీ నువ్వంటే,.కొండంత దేముడివి సాక్షాత్తూ కుబేరుడంతటి వాడవు, అంతర్జాతీయ స్థాయితో అలరారే పవర్ఫుల్ గాడ్వి, మరి నా లాంటి అమాయకపు, తండ్రి మాట జవదాటని వెర్రి రాముడని కూడా లేదు ....నా నగా ...నట్రా కూడా ....ప్ట్ .....దుఃఖంతో మాట పెగల్లేదు భద్రాద్రి రాముడికి .

"దోచుకోవడంతో సరి పెట్టడం లేదే ....అమానుషంగా నైవేద్యాలు కూడా ... అదీ ఘోరంగా జంతువ్యర్థాలతో ......అంత అవమానం ఎలా సహించమంటావ్ .....విధాతా?" ఛీత్కరించాడు సత్య దేవుడు.

"అడుగడుక్కి ఒక గుడి కట్టడం దేనికి .....ఇలా ఘోర అవమానాలు చేయడం దేనికి?వాలం ఝుళిపించాడు మారుతి.

"ఓరి వెర్రి వాడా ... వాళ్ళు ..ఏమైనా నీలా నిష్కల్మష భక్తులా? వాళ్ళు గుడి కట్టినా, గోపురం కట్టినా భక్తితో అన్న రోజులు పోయాయ్. అవి మానవుడి స్వార్థపు చదరంగంలో పావులయ్యాయి . భక్తికో, ముక్తికో కాక భుక్తికో యుక్తికో ఆలవాలు అవుతున్నాయి మన ఆలయాలు'' నిట్టూర్చాడు వాసు దేవుడు.

మౌనంగా కూర్చున్న ఈశుడి మీద పడ్డాయి విధాత కళ్ళు.

"ఏం మహేశా ... నిర్వికారంగా ....నిరామయంగా కూర్చున్నావు ... నీవేమి మాట్లాడటం లేదేమి? నీకు లేవా ఫిర్యాదులు ? అడిగాడు

"నాకేమున్నవి ... బ్రహ్మదేవా, నగలా ...నాణ్యాలా? సిరులా సంపత్తులా? ఏదో ...పులి తోలు చుట్టుకు బూడిద పులుముకు తిరిగే సన్యాసిని, నా వద్ద ఏమున్నది ....దోచుకోవడానికి బూడిద తప్ప......."చిద్విలాసంగా చిరు నవ్వులు రువ్వాడు రుద్రుడు. అంతలోనే ....జ్ఞప్తికి రాగా ....అన్నట్లు ...ఈ నరాధములు నన్నూ విడువలేదయ్యా రుద్ర భూములు సైతం కబ్జా చేస్తున్నారు, కజ్జా కోరులు ... కాని నేడు కాకున్నా రేపైనా వారు చేరే చోటే కదాని వదిలేస్తున్నా"వచించాడు ఈశుడు.

"అమ్మా ... దేవతా మూర్తులారా, శక్తి స్వరూపిణులారా ... లక్ష్మి ... సరస్వతులారా .... అందరికి కావలసిన వారు పరమపూజ్యనీయులు, మరి మీరెందులకమ్మా ఈ సమ్మెలో పాలు పంచుకుంటున్నారు?"ఆర్తితో అడిగాడు చతుర్ముఖుడు

బిగబట్టిన దుఃఖం పెల్లుబుకగా ....భోరుమన్నారు ....లక్ష్మి సరస్వతులు.

"వలదు వలదు వారిజాక్షులార, శోకింపతగదు. ఎందుకు అంతలా పొగిలి కుములుతున్నారు? కారణం ఏమి? అందరకూ ఆరాధ్యులే ... స్త్రీ మూర్తులే మీకు వచ్చిన కష్టం ఏమి? " లాలనగా అడిగాడు .

"ఆరాధ్య దేవతలా .... పాడా ... అందరికంటే చులకన చేసి ... అగౌరవపరచినదే కాక, అడ్డంగా వాడుకుంటున్నది మమ్మల్నే ....ప్రతివాడికీ పేరాశే, అడ్డదారిలో ఆర్జించాలనే, చేసే అన్ని వెధవపనులకూ కారణం నేనే కావలసి రావడం ఎంత శోచనీయం, ఆఖరికి నా రూపం కూడా .. నకిలీ చేసి దొంగ నోట్ల రూపంలో ....." పట్టరాని దుఃఖంతో గొల్లుమంది లక్ష్మీదేవి.

"సరస్వతీ కటాక్షం " అనేది ఎంత గొప్పగా చెప్పుకునే వారు, వారికి ఇచ్చే గౌరవం ... నభూతో నభవిష్యతి అన్నట్లుండేది, అలాంటిది ఇప్పుడు నిజమైన చదువులూ లేవు , వాటికి విలువలూ లేవు....అంతా రాజకీయమే ... నోటుకు, .వోటుకు వున్నవిలువ చదువుల కెక్కడిస్తున్నారు? వోటు బ్యాంకు రాజకీయాల కోసం చదువులని అధోగతి పాల్జేస్తున్నారు. కోటాల, వాటాల చదువులయిపోయాయి ... మెరిట్ కి వెర్రీ కిల్లింగే ... భోరుమంది చదువుల తల్లి.



యిలా పెద్ద పెద్ద పోర్టుపోలియోలున్న దేముళ్ళంతా ఉక్రోషంగా ఆక్రోశిస్తుంటే, మేమున్నాం ...మీకు అండగా అన్నట్లు వెనకే నిలబడ్డారు మిగతా వాళ్ళు .

నిశ్శబ్దంగా కూర్చున్న షిర్డీ నాధుడి మీద పడింది పెద్దాయన చూపు ... నాకు తెలిసీ నీకు ఎటువంటి ...అపరాధము అన్యాయము జరగలేదు కదా సాయి మరి నీవెందుకు ఈ సమ్మెలో పాలు పంచుకుంటున్నట్లు? నిలదీసాడు.

"నాకు ప్రత్యేకించి ఏ సమస్యా లేని మాట నిజమే కాని ... సాటివారికి జరిగిన ... జరుగుతున్న అన్యాయాలకు నిరసనగా నేను ... సానుభూతి సమ్మె గా ఒక్క రోజు పాల్గొనదలచా దేవా ...."వినమ్రంగా చెప్పాడు సాయి .

బ్రహ్మ దేముడు ఎంత నచ్చ చెప్పినా వినలేదు వారంతా. ఫలితం ... నిరవధిక సమ్మె ... పెద్ద ... చిన్న అన్ని ఆలయాల్లోనూ దేముళ్ళు లేరు ... పూజలు లేవు ... అంతా గందరగోళం ... ఈశుడూ ,సాయీశుడు ఇంకా కొందరు చిన్న చితక దేముళ్ళు మాత్రం సమ్మె విరమించుకుని గుళ్ళలో యధా తధంగా ధూప దీప నైవేద్యాలు అందుకుంటున్నారు .

నిరవధిక సమ్మె ... ఒక రోజా ... రెండు రోజులా? పది రోజులకు పైగా అయింది ... ఆలయాలు వెల వెల బోతున్నాయి స్వార్ధపరుల గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నాయి, అమాయకుల ప్రాణాలు విల విలాడుతున్నాయి , ఇది ఏ విపరీతాలకు దారి తీస్తుందో అని.

అలా ఊరుకుంటే మనుషులెందుకవుతారు? పదకొండో రోజు ప్రత్యామ్నాయం ఏర్పాటు చేసేశారు. నకిలీ నగలు నకిలీ విగ్రహాలు సృష్టించగా లేనిది, సృష్టికి ప్రతి సృష్టి చేసి ... క్లోనింగ్ చేయగలిగిన అపూర్వ మేధస్సు కలిగిన మనిషికి ఇదెంతలో పని? ఉషోదయాన చిద్విలాసంగా చిరునవ్వులు చిందిస్తూ మరింత మెరుగులతో తిరుమలేసుడు హతవిధీ, ఎంత అన్యాయం ? ఎంత అమానుషం? పది రోజుల సమ్మె చేస్తే మాత్రం ఇంత ఘోరమా? బ్రహ్మ సన్నిధిలో గోల గోల పెదుతున్న వెంకటపతి. ఏం లాభం? సీటు ఫిల్లయి పోయింది నకిలీ స్వామితో ... నో వేకెన్సీ,ఆలోచించాడు బ్రహ్మ .....వెంకటపతిని ఓదార్చి ఇలా చెప్పాడు. "అయినదేదో అయింది .....ఇప్పుడు విచారించి లాభం లేదు ....ఇది ఒక రకంగా మంచిదే. కొన్ని వందల వత్సరాలుగా ఇదే కొండలమీద కొలువున్నావు, ఎంతో ఖ్యాతినార్జించావు, కాలంతో బాటు , పూర్వపు పవిత్రత కనుమరుగవుతూ, పక్కా వ్యాపార నిలయంగా మారి ,కలుషితమవుతున్న ఈ తావిలో నువ్వింక సతమత మయ్యే బాధ తప్పింది. అమెరికాలో చికాగోలో బాలాజీ ఆలయ నిర్మాణం జరుగుతోంది .అక్కడ నిజమైన భక్తి ప్రపత్తులతో అలరారుతున్నారు జనులు, కనుక నువ్వు కొంత కాలం ఆ అనుభవాలని రుచి చూడు. తిరిగి నీ స్థలానికి నువ్వు వచ్చే మంచి రోజులు ముందు ముందు వస్తాయనే నమ్మకం , ఆశ నాకున్నాయ్ ......అంత వరకు .....అక్కడే అలరారు" అంటూ ఊరడించాడు .

రెండు మూడు ఆలయాల్లో అలా జరగ గానే ... ఠక్కున చేరి పోయారు మిగతా దేముళ్ళు తమ తమ ఆలయాల్లో సమ్మె విరమించుకుని. పాపం ...దేముళ్ళు , అంతటి బ్రహ్మదేముడైనా నిమిత్తమాత్రుడే అయ్యాడు" మనుషులా మజాకానా.

అదొక పెద్ద విజయంగా శ్లాఘించాయి .....అన్ని మీడియా రంగాలూ.

" అమ్మయ్యా ... ఏదో రకంగా ఓ కొలిక్కి వచ్చింది వ్యవహారం " సంతోషంగా నిట్టూర్చారు ఆండాళ్ళూ, అఖిలాండేశ్వరీ.

# మానవ సంబంధాలకై ఎలుగెత్తిన బాగోతులాయన

- కరణం శ్రీనివాసులు రెడ్డి
94932 12454




"ఎలా చెప్పినా దుఃఖాన్ని ఎంతని చెప్పినా అనువాదమే అవుతుంది గానీ పక్కా దుఃఖం అవడం లేదు'

- శవయాత్ర, ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

సమాజంపై తీవ్ర పరివేదన, ఆర్తి, బాధ్యత వుంటేగానీ కవి కలం నుండీ ఆ దుఃఖ చిత్రం పొంగుకురాదు. పొగులుకొస్తున్న దుఃఖాన్ని పూర్తిగా పరచలేకపోతున్నాననే దుఃఖాన్ని ఇందులో ప్రతి అక్షరం ప్రకటిస్తోంది. ప్రపంచంలో ఏదీ పరిపూర్ణం కాదు. అది దుఃఖమైనా, కవిత్వమైనా, ఆఖరుకు జీవితమైనా, కాకపోతే ఆ పరిపూర్ణతకై పడే పరితపన, చేసే ప్రయాణమే జీవితం. అందుకే "జీవితం ఒక Incomplete poem. Poem ఒక incomplet life. No end. అంటారు శివారెడ్డి ఒకానొక ముందుమాటలో.

మానవ జీవిత వ్యదార్థ దృశ్యాలు చిత్రిక పట్టాలనీ, సమాజానికీ, తనకూ కవిత్వం ఒక యానకమనీ ఆ యానకం సమాజాన్ని తనలోకి. తనను సమాజంలోకి ప్రవహింపజేయాలనీ కవి ఆరాటం. అలాంటి ఆరాటంతో తపనతో "కవిత్వం పట్ల విధేయతతో బాధ్యతతో కండ్లలో వత్తులేసుకున్న మెలకువతో కవిత్వం రాస్తున్న" కవి జూకంటి జగన్నాథం.

బొగ్గు గనుల్లో ప్రమాదాన్ని ముందుగానే పసిగట్టి హెచ్చరించే కేసరిపిట్టలాంటి కవి జూకంటి. దేశాన్ని ముంచెత్తబోయే ఉపద్రవాన్ని ముందుగానే కనిపెట్టి జరుగుతున్న కుట్రను బట్టబయలు చేస్తూ ముందస్తుగా హెచ్చరించాడు. సమస్త విలువలూ, సంబంధాలూ, సంస్కృతులూ విద్యలూ దేనితో విరూపమయ్యాయో, దేనివల్ల వ్యక్తిత్వాన్ని, సహజత్వాన్ని కోల్పోయి కలుషితమయ్యాయో ఆ ప్రపంచీకరణ వాసనను పసిగట్టి 1987 జనవరిలోనే

"పెట్టుబడి అన్ని రంగాలనూ/ఇనుప కౌగిలిలోకి/లాక్కొని బుజ్జగిస్తున్నప్పుడు/సమస్త విలువలూ నశిస్తాయ"ని మనల్ని హెచ్చరించాడు. -సంధికాలం - పాతాళగంగ

మానవ విలువలు లుప్తమైపోవడానికి మూలమెక్కడో విప్పి చెబుతాడు. భారతదేశంలో 1991 నుండీ సరళీకృత ఆర్థిక విధానాలకు తెరతీసి ప్రపంచీకరణ దుష్ప్రభావాలు అన్ని రంగాలకూ చాపకింద నీరులా వెళ్ళి తడి తగిలితే అప్పుడు లేచి గగ్గోలు పెట్టిన కవులు చాలా మందే వున్నారు. జూకంటి అలాంటి కవి గాదు. ఇప్పుడు మనం మానవ సంబంధాలు మృగ్యమయ్యాయని మొత్తుకుంటుంటే ఆయన 25 సంవత్సరాల క్రితమే

"మన చెమటతో సృష్టించిన/ వస్తువు నించి/ మనల్ని పోటీ పరాయివానిగా చిత్రీకరిస్తుంది/ అప్పటి వరకూ/మానవ సంబంధాల మధ్య బతికున్న సమస్త ప్రేమలూ/ సంకుచితమై పోతాయి" - (సంధికాలం - పాతాళగరిగె)

అని మానవ సంబంధాలకు పట్టిన చీడను గుర్తించగలిగారు. మానవ సంబంధాలనే విశ్వ వృక్షానికి పాదు. కుటుంబం అందుకే అంటారు జూకంటి -

"ఇల్లు/ మనిషిని మనిషిగా తీర్చిదిద్దే పాఠశాల

నెలసరి జీతంలేని ఒక ఉపాధ్యాయురాలు" అని కుటుంబ సంబంధాలే తర్వాత సామాజిక సంబంధాలకు ఆధారభూతమౌతాయి. కానీ సంఘటితం, ఉమ్మడితత్వం, సామాజిక అల్లికలోని చిక్కదనం పెట్టుబడికెప్పుడూ ప్రమాదమే. అందుకే పెట్టుబడి - వేళ్ళూనుకోవాలంటే మొదట ధ్వంసం కావాల్సింది కుటుంబమే. పెట్టుబడి మొదటి టార్గెట్ కుటుంబమే. కుటుంబంలోకి పెట్టుబడి ప్రవేశించడమే జరగబోయే విధ్వంసానికి నాంది. జూకంటి ఆ సంగతే అంటున్నారు.

"అవును నిజమే/ అన్ని షరతులకూ లోబడి నిస్సిగ్గుగా/ పెట్టుబడిని ఆహ్వానించినపుడే/ పురుషుడు ఒక వస్తువు/ పెండ్లాం ఒక చెక్‌బుక్/ పిల్లలు ఒక వ్యాపారపు చేను" కాబోతున్నారని హెచ్చరిస్తున్నారు.

పెట్టుబడి భౌతిక రూపం వస్తువు. దానికి కావాల్సింది మార్కెట్. మార్కెట్ కోరుకునేది అమ్ముడుపోవడం. అందుకు కావాల్సింది వినియోగదారులు. మనుషులు కాదు. మనుషులంతా వినియోగదారులుగా మారింతర్వాత వారి మధ్యునుండేవి మానవ సంబంధాలు కాదు. వస్తు సంబంధాలు, వినిమయ సంబంధాలు. ఈ సంబంధాలు అంతిమంగా పోటీకి దారితీసి కుటుంబంలో కనిపించని విభజనరేఖలు గీస్తాయి. వాటి ఆధారంగానే మనుషులకు విలువలు నిర్ణయించబడతాయి. ఈ "నిజాన్ని నేను చెబుతాను" అంటూ "మన మధ్య వున్న సంబంధాలు/ వస్తువులుగా చలామణి అవుతున్నప్పుడు/ పోటీయే మన విలువను శాసిస్తుంది". అంటాడు జూకంటి

ఆ విలువ మనం వాడే వస్తువును బట్టి నిర్ణయమవుతుంది. కుటుంబంలోని సంబంధాలు కూడా ఈ విలువ ఆధారంగానే నిలబడే పరిస్థితి దాపురించింది. అందుకే కవి-

"పెండ్లాం పిల్లల సంబంధ బాంధవ్యాల ప్రవర్ధతకు/ ప్రేమ ఆత్మీయతలు గాక/ డబ్బునే ఎరువుగా వాడుతున్నా"మని

ప్రేమ, ఆప్యాయతల స్థానాన్ని డబ్బు, వస్తువులు ఆక్రమించాయి. డబ్బుకొద్దీ ప్రేమనీ, వస్తువును బట్టి ఆప్యాయతలనూ కొనుక్కోవడం, అమ్ముకోవడం. ఇప్పుడు ఇల్లొక వ్యాపార కేంద్రం. మాంచి మార్కెట్.

"పచ్చని జీవితానికి డబ్బు చీడ/ వస్తువు పీడ తగిలింది

అయ్యా!/ వస్తువులమంతా చేరాక/ ఇల్లు మనసును ఖాళీ చేసిన/ మార్కెట్టు అయ్యింది"

కుటుంబం ధ్వంసమై మార్కెట్టయితేనే పెట్టుబడి వర్ధిల్లేది.

సరళీకరణ పేరుతో పిల్లల కోడిపై పెట్టిన గంపనెత్తేశారు. గద్దల్నాహ్వానించారు. పిల్లల్ని కాపాడుకోలేక తల్లడిల్లే తల్లికోడి లెక్కనుంది ఇంటి పరిస్థితి. కాపాడాల్సిన వారే అన్నీ బార్లా తెరచి, వేలుజూపి మరీ తన్నుకుపొమ్మంటున్నారు. ఈ సందర్భాన్నే -

"ఇల్లు ఇల్లులా లేదు/ కోడి రెక్కల కింద/ తన పిల్లల్ని పొదుగుకు దాచుకుని వుండాల్సిన/ ఇల్లు తల్లిలా లేద"ని చెబుతున్నాడు కవి.

పిల్లల్ని తన్నుకపోనొచ్చిన గద్దనే మనల్నుద్ధరించ డానికొచ్చిందని ఊదరగొడతారు పాలకులు. అన్ని అనుపానులూ, రహస్యాలు దాని చెవిలో వూది దానికి అభివృద్ధి రంగు పులిమి దేశం మీదికి వదులుతారు దాంతో

"ఎరకోసం తిరుగుతున్న డేగ/ మన మంచి కోసం కాపలా తిరుగుతుందనే/ భ్రమలోకి కూరుకుపోతాం./ డేగ రానురానూ/ మన ఆకాశాన్ని కబళించి/ అన్నీ తానై కూచుంటుంది"/ డేగ మనల్ని నిలబడనీయదు, నిద్రపోనివ్వదు/ అడగకుండానే పగ్గాలు వాని చేతికిచ్చి/ బండినీ, బండెడు బరువునూ నెత్తిన మోస్తూ/ పోటీపడి పరుగందుకుంటాం"

- డేగ-పాతాళగరిగె

పెట్టుబడి, ప్రైవేటీకరణ, సరళీకరణ, ప్రపంచీకరణ-లనేవి అభివృద్ధికి అనివార్యమనే భ్రమ కల్పించి ఆ మార్గంలోకి మనల్ని బలవంతంగా నెట్టేసి దేశాన్ని ఒక మార్కెట్‌గా మార్చి, మనిషిని వనరుగా, పనిముట్టుగా మలిచి సకల మానవ సంబంధాలనూ మార్కెట్‌తో ముడిపెట్టి కమనీయ దేశ దృశ్యాన్ని కకావికలం చేసిందీ- ఉదార ఆర్థిక వాద విధానం.

"డబ్బిచ్చి ఎర్రి (పిచ్చి) కొనుక్కున్నట్లు" ఇంటికి ఒక టి.వి. కొనుక్కుంటే చాలు. ఇల్లు ఇల్లు కాకుండా పోవడానికి మన బాంధవ్యాలనే భోజనంగా చేసుకొని మనల్ని తన వశం చేసుకొనే టక్కుల మారిదీ టి.వి దెయ్యం

"ఇంతలో ఒక మూల టీ.వి. వచ్చి/ వస్తువుల కోసం/ భూమి నలుమూలలా మనను ఉరికిస్తుంది/ పిల్లల కోరిక ఒకటైతే/ పెండ్లా మొగల ఇచ్ఛ మరోవైపు/ గేర్లు మారుతుంటుంది/ ప్రపంచం ముంగిట్లో కొచ్చిందనుకొనేటప్పటికి/ పచ్చని సంసారంలో/ పొగలేని నిప్పు రాజేస్తుంది" -ప్రమాదసూచిక ఇండియా ప్రైవేట్ లిమిటెడ్

అంతటితో వూరుకొంటే ప్రపంచీకరణ ప్రయోజనాలు నెరవేరవు కదా! టి.వి. అంతిమ కర్తవ్యం.

"పిల్లల నుంచి తల్లిదండ్రుల్ని/ పెళ్లాల నుంచి మొగుల్లని/ తల్లుల నుంచి తండ్రుల్ని/ ఇంటి నుంచి మనుషుల్ని/మనుషుల నుంచి మనసును/ సమూహం నుంచి వ్యక్తుల్ని/ విడగొట్టడం పడగొట్టడం/ విధ్వంసం కంస దృశ్యాల్ని/ రిమోట్‌తో స్వాప్ చేయడం" - అల్ కొత్త సోపతులు - పిడికెడు కలలు! దోసెడు కన్నీళ్లు

ఈ విడగొట్టడం, పడగొట్టడం పని ప్రపంచీకరణ సమర్థవంతంగా నిర్వహిస్తుంది. ఎందుకంటే మన ఆత్మీయతలు, అనుబంధాలు, జ్ఞాపకాలు, సంబరాలు, సాధక బాధకాలు, సంసారాలు, సంస్కృతులూ సమస్తాలన్నీ మార్కెట్‌కు అనుసంధానించి, వ్యాపార లావాదేవీల వ్యవస్థలోకి లాక్కొంటేనే అది మనుగడ సాగిస్తుంది. తన కార్యకలాపాలు విజయవంతంగా కొనసాగిస్తే

"పిల్లలకు చక్కని క్రెషెష్/ వృద్ధులకు ఎంచక్కా ఆశ్రమాలు/ పక్కపక్కనున్నా మనిషికీ మనిషికీ నడుమ/ విస్తరిస్తున్న వేనవేల కొలది మైళ్ళ దూరాలు"/ ఏర్పడి ఒకరికొకరం వ్యాపారపు - సరుకులౌతాము.

ఇప్పుడు ఇల్లొక ఎంటర్‌ప్రైజ్, ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ. పిల్లలు పెట్టుబడి దానిపై అధిక రాబడికై వ్యూహాలు. దేనిపై ఎంత ఖర్చుపెడితే భవిష్యత్‌లో అధిక లాభాలొస్తాయో దానిపైనే కన్ను. అదే సాఫ్ట్‌వేర్, మెడిసిన్, సి.ఎ, మొదలయిన కార్పొరేట్ చదువులు విద్యార్థి అనే వస్తు నాణ్యతకు ర్యాంకొక ఐ.యస్.ఓ. (ISO) సర్టిఫికెట్. ఈ విషయాన్నే "కొత్తపంట" కవితలో

"కడుపు చించుకు పుట్టిన పిల్లల పట్ల/ కేవలం యాజమాన్య పాత్ర పోషిస్తాం/ పిల్లలకీ మనకూ/ ఒక వ్యాపార ఒడంబడిక ఇనుప తెర" ఈ వ్యాపార దృక్పథం విద్యా లక్ష్యాన్నే మార్చేసి

"మనిషిలోని వెలుగుదారుల్ని తెరవాల్సిన/ చదువు పుస్తకం నిండా రూపాయల కట్టలక్కట్టలు గుమ్మరిస్తోంది. వాస్తవాన్ని కళ్ళముందు కుప్పపోస్తున్నాడు కవి.

శాస్త్రీయ దృక్పథంతో జ్ఞాన సముపార్జన చేసి సత్యాన్వేషణ చేయడం ద్వారా పరిపూర్ణ మానవత్వ వికాసం వైపు మనిషి నడిపించేది విద్య. నేడు ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ పేరుతో ప్రతిదీ మార్కెటైజ్ అయిపోతున్నప్పుడు మనిషిని మనిషిగా నిలబెట్టే ప్రయత్నం నుంచీ విద్య తప్పుకొని కేవలం మార్కెట్‌కు కావాల్సిన వస్తూత్పత్తినీ, సేవల్నీ అందించడానికి అనువైన రీతిలో నిపుణుల్ని తయారుచేసి మార్కెటింగ్ కూడా చేసి పెట్టడమే విద్య యొక్క అంతిమ లక్ష్యంగా మారిపోయింది.

మార్కెట్‌కు కావాల్సింది మానవత్వం కాదు. నూతన ఉత్పత్తులను సృష్టించడానికి ప్రోగ్రామింగ్ చేయబడ్డ మెదళ్ళు. ఆ ప్రోగ్రామింగ్ చేయబడే చోటే బడి. అందమైన బాల్యానికది జైలే. విద్య పేరుతో చదువు చెరసాలలకెళ్ళిన పిల్లల నుద్దేశించి కవి

"ఏ రెసిడెన్షియల్ పాఠశాల దగ్గర/ సెలవు ములాఖత్ చూసినా/ జరిగిన ఘోర రైలు ప్రమాదం/ హాహాకారాలు మిన్నుముడుతుంటాయి/ పిల్లల కన్నీళ్లతో దేశం తగల బడిపోతోంది'' అంటూ దుఃఖం దృశ్యాన్ని మన ముందుంచుతాడు"

పట్టణంలో అమ్మానాన్నలు డబ్బు వేటలో. బళ్ళో పిల్లలు ర్యాంకుల వేటలో.. అంతిమంగా అందరి పయనం వస్తు వినియోగం వైపుకే.

''ప్రతిదీ వస్తువైన చోట/ ఇల్లుకు వెల నిర్ధారించబడుతుంది/ ప్రతిదీ కిరాణా దుకాణమైనచోట/ మనిషికి ఒక ధర నిర్ణయించబడుతుంది/ మనిషి వినియోగదారుడై/ వినియోగదారుడు వస్తువై మెడకు ప్రైస్‌ట్యాగ్‌తో/ చేజేతులా ఉరి బిగించుకుంటాడు

- పరాజితుడు - చిలుక రహస్యం.

అంతిమంగా మనిషి మరణిస్తాడు. కళ్ళముందు కోట్లాది మంది మనుషులు చేజేతులా ఉరితాళ్ళకు వేలాడుతూ 'వస్తువు' వికటాట్టహాసం చేస్తుంటే పొగులుకొస్తున్న దుఃఖాన్ని

"ఎలా చెప్పినా దుఃఖాన్ని ఎంతని చెప్పినా/ అనువాదమే అవుతోంది గానీ/ పక్కా దుఃఖం అవడం లేదు

అని దుఃఖిస్తున్నాడు ఆ దుఃఖం వ్యక్తిగతం కాదు ''శిథిలమవుతున్న వ్యవస్థాబీభత్సాన్నీ మనిషిలో మోడువారుతున్న మానవత్వం, కుంచించుకుపోతున్న వైశాల్యాలూ, విడదీస్తున్న వైరుధ్యాలూ, బతుకు పొంగుకువస్తున్న సామాజిక సముద్ర దుఃఖం.

దుఃఖం ఒక ప్రక్షాళన. దుఃఖం ఒక ఉద్యమం. ఆ దుఃఖం లోంచే కవి ఎలుగెత్తి...

"ఎక్కడ జీవితం/ చాపకింద నీరులా ప్రవహిస్తుందో/ అక్కడ వెదకడానికి ఉద్యమించు/ పెరట్లోని మట్టిలోంచి లేచిన/ నంది వర్ధనాన్ని కౌగలించుకో/ ఒక వంద గీతలు దొరుకుతాయి

ఒక వేయి సంగీతాలు వినిపిస్తాయ"ని ఉద్యమాన్ని ఎక్కడ నుండీ ప్రారంభించాలో స్పష్టంగా వినిపిస్తున్నాడు.

దుఃఖం ఒక విప్లవం/ "విలువలు కబళించిన పెట్టుబడిపై/ నిఖార్సైన విలువల ఉనికి కోసం/ జనం మెదళ్ళు పోటెత్తుతాయి

ఊపిరిగా ఎర్ర గులాబీలు పూస్తాయి" అని మన యుద్ధం ఎవరిపైననో, దేని కోసమో మన ఆయుధమేమిటో ప్రకటిస్తున్నారు.

''ప్రతిరోజూ మనం గెరిల్లా మెలకువతో/ యుద్ధం చేయాల్సిందే/ ప్రతిరోజు మనం అంపశయ్యపై పడుకోవడం/ నేర్చుకోవాల్సిందే" నని దిక్కులు పిక్కటిల్లేలా సముద్రాలు వుప్పొంగేలా నోటికి రెండు చేతులూ అడ్డం పెట్టుకొని, చెవుల తుప్పు వదిలేలా, మెదడు పరతంత్రపు పొర పగిలేలా ఎలుగెత్తి చాటింపు వేస్తున్న బాగోతులాయన మన జూకంటి జగన్నాథం.



పశుసంపదపై అరుదైన నవల

### పరస

- డా॥ వి.ఆర్. రాసాని

వెల : 75/- పేజీలు: 103

ప్రతులకు : 98484 43610

గ్రామీణ జీవితంతో అనుబంధం లేని వ్యక్తులు ఈ నవలలోని కనుమరుగవుతున్న జీవన దృశ్యాలను చదివితే ఒక కొత్త ప్రపంచాన్ని చూసిన అనుభూతి కలుగుతుంది.

- నాయుని కృష్ణమూర్తి



### చీకటి ముడులు

- డా॥ వి.ఆర్. రాసాని

వెల : 75/- పేజీలు: 121

ప్రతులకు : 98484 43610

చిత్తూరు జిల్లాలో ప్రతి ఏడాది క్రమం తప్పకుండా 'భారతం ఆడటం' అనే ఒక ప్రత్యేక సంస్కృతి వందల సంవత్సరాలుగా ఉంది. ఈ భారతం ఆటస ఈ వ్యవస్థను ఏ మాత్రం ముందుకు జరిపిందో చెప్పలేనుగాని, రాసాని చెప్పిన ఈ సరికొత్త భారతం చిత్తూరు జిల్లాలోనే కాదు, దాని ఎల్లలు కూడా దాటుతుంది. సమాజం మార్పుకోసం మరో గీతోపదేశం చేస్తుంది.

-ఆచార్య మేడిపల్లి రవికుమార్



హోసూరు కతలు

### తెల్లకొక్కర్ల తెప్పం

- డా॥ ఎన్. వసంత్

వెల : 60/- పేజీలు: 95

ఈ సంకలనంలోని ఎక్కువ కథలు మా ప్రాంతంలో జరిగిన యదార్థ సంఘటనలే. తెలుగుకోసం భాషాభిమానులు పడే బాధ, తెలుగు సంఘాల పోరాటం, రాజకీయ నాయకుల ఆరాటం మొత్తంగా ఇక్కడి తెలుగులు భాషకోసం పడిన, పడుతున్న తాపత్రయాన్ని కొంతవరకైనా కథలుగా మలచాలనుకొన్నాను. ఆ ప్రయత్నంలో భాగమే మీ ముందున్న ఈ తెల్ల కొక్కర్ల తెప్పం.

- డా॥ ఎన్. వసంత్



### మట్టిని మరువలేను

- సి.హెచ్. ప్రకాశ్

వెల : 100/- పేజీలు: 106

ప్రతులకు : 093464 03040

ప్రకృతిని చూసి, విశ్వాంతరాళాన్ని - నక్షత్రమండలాన్ని చూసి దిమ్మెరపోయి అద్భుత ఆశ్చర్యంలో మునిగిపోయే లక్షణం ప్రకాశ్‌లో పుష్కలంగా వుంది. A sense of wonder - a sense of innocence - అంతర్లీనంగా అతని కవిత్వమంతటా వుంది.

- కె. శివారెడ్డి



### పునఃప్రస్థానము

పల్లె పాటలు

- యస్‌బిఅలి

వెల : 30/- పేజీలు: 49

ప్రతులకు : 94400 37786

బందె అలి గారిలో ఎక్కడా తిరుగుబాటు కనిపించదు. బాధా, వ్యధ వెదకల పోసిన నిరాశ! ఆయన కవిత్వం నిజంగా ఆలోచింపచేస్తుంది. అధ్యయనం చేయిస్తుంది. ఉద్రేకపరిచి ఉరుకులు పరుగులు పెట్టించదు.

- రాజీవ



### టిబెట్‌లో 15 నెలలు

హిందీ మూలం

మహా పండిత్ రాహుల్ సాంకృత్యాయన్

తెలుగు అనువాదం

పారనంది నిర్మల

వెల : 225/- పేజీలు: 234

జీవిత సత్యాన్ని మరియు చింతన గురించి తెలుసుకోవాలంటే ఈ పుస్తకాన్ని చదవండి. నాకు తెలిసినంతవరకూ హిందీలో యాత్ర గురించి రాసిన మొట్టమొదటి మౌళిక పుస్తకం ఇది

- జయచంద్ర

## ఆకాశమంత కథల సంపుటి

**డాక్టర్ శమంతకమణి**

వెల : 15ం/- పేజీలు: 200

ప్రతులకు : 9491962638



శోధన, సాధన లక్ష్యాలుగా సాగుతున్న జీవనయానంలో నాకెదురైన చిన్నపాటి అనుభవాలే నా కథాంశాలు. చదవండి. సద్విమర్శను హృదయ పూర్వకంగా ఆహ్వానిస్తున్నాను.

**- డాక్టర్ శమంతకమణి**

## వడలి రాధాకృష్ణ కథలు

వెల : 15ం/- పేజీలు: 144

ప్రతులకు : 99853 36444




కథలన్నిటా ఎన్నో జీవన విపర్యాలు, వ్యత్యాసాలు, మనుషుల మనస్తత్వాలలోని వైరుధ్యాలు చదువరిని అంతర్ముఖీనుణ్ణి చేస్తాయి. చదవండి.. ఏ కథకాకథ రసార్ణవం, ఏ పాత్రకాపాత్ర ఒక సమూహంలోని ఒక ప్రత్యే పాత్ర. ఇదీ విశేషం.

**- విహారి**

## మనసుతడి కవిత్వం

**- పాతూరి అన్నపూర్ణ**

వెల : 100/- పేజీలు: 100

ప్రతులకు : 94902 30939




పాతూరి అన్నపూర్ణ గారు నిజంగా బతికి వుండటానికి తన్ను తాను వెలిగించుకుంటానికి, జీవితాన్ని అర్థవంతంగా నిర్మించుకుంటానని బతుకును ఒక సంబరంగా జరపుకునేందుకు నడుం కట్టటమే ఆమె కవిత్వం. వస్తువును ఆమె కవిత్వం చేసే క్రమం చాలా సరళమైంది. డొంక తిరుగుళ్ళు, సంక్లిష్టతలు, అన్వయ కాఠిన్యాలు లేక చాలా సూటిగా సాగిపోతుంది.

**- కె. శివారెడ్డి**

## హోసూరు కతలు

## వెండిమొయిళ్లు బండబతుకులు

**- అగరం వసంత్**

వెల : 100/- పేజీలు: 137

ప్రతులకు : 9488330209



ఈ కతలు నన్ను విడవకుండా రెండుతూర్లు చదివించేటట్లు చేసుకొనిందానికి కారణము, వీటిల్లోని తెలుగు ఒంపుసొంపులు. తెలుగుతల్లి గారాల కడుపుపంట మా హోసూరు గడ్డ. ఈ గడ్డ మన్నుగమ్ములను నింపుకొన్న కతలివి. ఈ మన్నును బుక్కి మనుషులమైన మా తావు బతుకులివి.

**- నంద్యాల నారాయణరెడ్డి,**

## రాయలసీమ తొలితరం కథలు

**- డా॥ తవ్వా వెంకటయ్య**

వెల : 120/- పేజీలు: 164

ప్రతులకు : 97039 12727




వెంకటయ్య మన ముందుంచుతున్న ఈ తొలితరం కథలను లోతుగా అధ్యయనం చేయవలసి ఉంది. అటు సామాజిక శాస్త్రజ్ఞులు, ఇటు సాహిత్య విమర్శకులు, సీమలోని సామాజిక సాహిత్య పరిణామాలను నిర్మమకారంగా పరిశీలిస్తే వెంకటయ్య కృషి సఫలమైనట్లే.

**- ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి**

## నా చిరునామా

**కవిత్వం**

**- రమణ వెలమకన్ని**

వెల : 125/- పేజీలు: 136

ప్రతులకు : 9966015040




అక్షరాలను చిదిమాను
లావాలా వాక్యాలై ఎగిశాయి
గాయమైనవి కొన్ని
గేయాల్లా జారినవి మరికొన్ని
.......
.......
ఓ అక్షరమా
నీకు నమస్కారం!

**- రమణ వెలమకన్ని**

## విశాఖలో శ్రీశ్రీ 105వ జయంతి



మహాకవి శ్రీశ్రీ 105వ జయంతి సందర్భంగా విశాఖ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో బీచ్‌రోడ్‌లోని శ్రీశ్రీ విగ్రహం వద్ద ఏప్రిల్ 30న జయంతి సభ, మహాప్రస్థాన గీతాలాపన జరిగింది. ఎమ్మెల్సీ ఎం.వి.యస్.శర్మ ముఖ్యఅతిధిగా హాజరై శ్రీశ్రీ విగ్రహానికి పూలమాలవేసి నివాళులర్పించారు. సాహితీస్రవంతి, విశాఖశాఖ, అధ్యక్షులు ఎ.వి.రమణారావు అధ్యక్షతన జరిగిన సభలో శర్మ ప్రసంగిస్తూ ప్రపంచం పెద్ద ఎత్తున ఆర్థిక సంక్షోభంలో కూరుకున్న 'హంగ్రీథర్టీస్' కాలంలో శ్రీశ్రీ మహాప్రస్థాన గీతాల్ని రచించారని, తన కవితలలో శ్రామిక జనాభ్యుదయాన్ని, పీడిత ప్రజల విముక్తిని, దోపిడీ, పీడనలు లేని మరో ప్రపంచాన్ని కాంక్షించారన్నారు. నేడు సమాజం అనేక సంక్షభాలనెదుర్కొంటున్నందున కవులు, సాహితీకారులు శ్రీశ్రీ స్ఫూర్తితో విస్తారంగా రచనలు చేసి ప్రజలను జాగృతం చేయాలని పిలుపునిచ్చారు. శ్రీశ్రీ విజ్ఞానకేంద్రం కార్యదర్శి వి.యస్.పద్మనాభరాజు ప్రసంగిస్తూ నేటి సంక్షుభిత ప్రపంచంలో వందలాది శ్రీశ్రీలు అవసరమని పేర్కొన్నారు. సాహితీ స్రవంతి, విశాఖశాఖ, కార్యదర్శి నూనెల శ్రీనివాసరావు మాట్లాడుతూ విశాఖ వన్‌టౌన్‌లో శ్రీశ్రీ నివసించిన గృహాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుని స్మారక కేంద్రంగా తయారుచేయాలని విజ్ఞప్తిచేశారు. అనంతరం జి.వి.ఎన్. చలపతి, ఎ.వి.రమణారావు, శ్రీనివాసరావు మహా ప్రస్థానంలోని "జయభేరి", "శైశవగీతి", "మరో ప్రపంచం", "ప్రతిజ్ఞ" తదితర గీతాలను ఆలపించారు. సాహితీస్రవంతి, విశాఖశాఖ, గౌరవాధ్యక్షులు ఎన్.రమణాచలం వందన సమర్పణతో ముగిసిన సభలో కవులు, సాహిత్యాభిమానులు పాల్గొన్నారు.

## కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో 'సంపంగి - సారంగి' నవల ఆవిష్కరణ



ఏప్రిల్ 19న కాకికాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో వుయ్యపు హనుమంత రావు రాసిన 'సంపంగి-సారంగి' నవల ఆవిష్కరణ సభ జరిగింది. రంపచోడవరం శాసన సభ్యులు శ్రీమతి వంతల రాజేశ్వరి, నవలను ఆవిష్కరించి మాట్లాడుతూ ఈ నవల అటవీ ప్రాంతానికి చెందిన గిరిజనులు, పరిశ్రమల పేరుతో ఏ విధంగా నిలువ నీడ లేకుండా చేయబడుతున్నారో, పర్యావరణ కాలుష్యానికి పరిశ్రమలు ఎలా కారణమవుతున్నాయో వివరించిందని ప్రశంసించారు. ఇగ్రి ఫౌండేషన్, కాకినాడ ఔటరీచ్ స్పెషలిస్టు వై. సత్య శివనాథ్ ముఖ్య అతిథిగా మాట్లాడుతూ డీప్‌వాటర్ పోర్టుతోపాటు పరిశ్రమలు పరిమితి లేకుండా కడుతున్నారనీ, హోప్ ఐలాండు కూడా తవ్వేస్తే, కాకినాడకు ఎంతో ముప్పు వాటిల్లుతుందని చెప్తూ లోతైన సాంకేతికాంశాలు ప్రజల దృష్టికి ఈ నవల ద్వారా రచయిత తీసుకురావడం అభినందనీయమని అన్నారు. శ్రీమతి పుప్పాల సూర్యకుమారి గౌరవ అతిథిగా పాల్గొన్ని ఈ నవలలో సంపంగి - సారంగి అనే అప్పాచెల్లెళ్ళ పాత్రల్ని రచయిత చక్కగా చిత్రించి నవలను సామాన్య పాఠకుడు కూడా ఉత్సాహంతో చదివేటట్లు రాసారని, చెప్పారు. విమర్శకులు పేరి చర్ల సీతారామ రాజు, నవలా నిర్మాణాన్ని గూర్చిన అంశాన్ని విశ్లేషిస్తూ కేవలం పర్యావరణ కాలుష్యం గూర్చిన రాజకీయ, ఆర్థిక అంశాల వివరణ కోసం ఈ నవల రాయబడినా, నవలలో అంతర్లీనంగా ప్రేమకథ కూడా జత చేసారని, ఆహ్లాదకరమైన వర్ణనలు ఉ ండడం చేత యువతరం మన్ననలు పొందగలదని చెప్పారు. పద్యకవి కె. గౌరీ నాయుడు నవలలోని గిరిజన సంబంధమైన అనేకాంశాలు విపులీకరిస్తూ, రచయిత పరిశీలనా శక్తిని ప్రశంసించారు. 'సంపంగి-సారంగి' నవలా రచయిత వుయ్యపు హనుమంతరావు, ఈనాటి కార్పోరేట్ నాగరికత, అత్యంత ప్రమాదకరంగా పరిణమిస్తోన్న తీరు ఆవేదన కలిగిస్తున్నదని, యువతరానికి తన భావాల్ని అందించడానికే ఈ నవల రాసానని స్పందన ప్రసంగంలో తెలిపారు. ఈ సందర్భంగా సి.పి.ఎం. వారు విశాఖ మహాసభల సందర్భంగా నిర్వహించిన నవలల పోటీలో మూడవ బహుమతినందుకున్న కథానవలా రచయిత గ.నా.రా (గదుల నాగేశ్వరరావు)ను హనుమంతరావు సముచిత రీతిలో సత్కరించారు. సాహితీ స్రవంతిపై గరికపాటి మాస్టారు వ్రాసిన పాటను మేడశెట్టి శ్రీరాములు ఉత్తేజకరంగా పాడి సభ్యుల్ని అలరించారు. డా॥ అద్దేపల్లి అధ్యక్షత వహించగా, గ.నా.రా వందన సమర్పణతో సభ ముగిసింది.

## కర్నూలులో మహాకవి శ్రీశ్రీ 105 వ జయంతి సభ

మహాకవి శ్రీశ్రీ 105 వ జయంతిని పురస్కరించుకొని కర్నూలు సాహితీ స్రవంతి, ప్రజా నాట్యమండలి సంయుక్త ఆధ్వర్యంలో స్థానిక కార్మిక కర్షక భవన్‌లో ఏప్రిల్ 30 న సాహిత్య సమావేశం జరిగింది. ప్రజా నాట్యమండలి జిల్లా అధ్యక్షులు వాసు స్వాగతం పలికిన అనంతరం శ్రీ శ్రీ చిత్రపటానికి పుష్పాభిషేకం చేసారు. ఈ సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రజా నాట్యమండలి జిల్లా నాయకులు బసవరాజు మాట్లాడుతూ శ్రీశ్రీని ఓ యుగకర్తగా కీర్తించారు. తెలుగు కవిత్వాన్ని మలుపు తిప్పిన మహాకవిగా పేర్కొన్నారు. ముఖ్య వక్తగా పాల్గొన్న డా.సి.హెచ్. రాజారెడ్డి మాట్లాడుతూ చైతన్య కవిత్వానికి ప్రతీకగా శ్రీశ్రీ ని పేర్కొన్నారు. ఖర్మ జలానికి, మర్మ జలానికి ఖరీదు కట్టే షరాబులేడన్న శ్రీశ్రీ శ్రమ జీవులకు, సామాన్యులు, తాడిత పీడిత వర్గాలకు తన కవిత్వాన్ని అంకితం చేశారన్నారు. నేను సైతం అంటూ పరుగులు పెట్టించారన్నారు. ఆ మహా కవి చనిపోయి మూడు దశాబ్దాలు దాటిపోయినా ఆయన కవిత్వం ప్రజల నోళ్ళలో ఇంకా నానుతోందన్నారు. సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు జంధ్యాల రఘుబాబు మాట్లాడుతూ శ్రీశ్రీ రచనల్లోని విషయం సామాజికమైనదే కాక ఆయన వాడిన భాష కూడా వచనంలో ఉన్నందువల్ల కవిత్వాన్ని సార్వజనీనం చేసిన ఖ్యాతి శ్రీశ్రీకే దక్కుతుందన్నారు. ఆయన సినిమా పాటల్ని కూడా కొత్త పుంతలు తొక్కించారన్నారు. కేవీపీఎస్ నాయకులు ఆనంద్, సాహితీ స్రవంతి జిల్లా సహాయ కార్యదర్శి మహేష్, సీఐటీయు నాయకులు శేషయ్య, గురుసేఖర్, సంజన్న, జేవీవీ నాయకులు డా.బడేసాహెబ్, సుధీర్ సత్యనారాయణ, లావణ్య, ఆనంద్ తదితరులు పాల్గొన్నారు.



'శ్రీశ్రీ జయంతి' ని పురస్కరించుకుని సాహితీస్రవంతి, ప్రజాశక్తి సంయుక్త ఆధ్వర్యంలో నిర్వహించిన కవితల పోటీలో ద్వితీయ బహుమతి గెలుచుకున్న ఎస్.ఎం. సుభానికి మెమెంటో అందజేస్తున్న మాజీ శాసనమండలి సభ్యులు కె.ఎస్. లక్ష్మణరావు. చిత్రంలో విజ్ఞాన్ రత్తయ్య, తదితరులు



హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో మే 10న సెల్యూట్ గ్రూప్ ఆఫ్ ఫెడరేషన్ ఆధ్వర్యంలో అంతర్జాతీయ మాతృదినోత్సవం సందర్భంగా 'జరిగిన 'అమ్మ– విశ్వప్రేమ స్వరూపిణి" పుస్తకావిష్కరణ సభ. చిత్రంలో విశ్రాంత ఐ.పి.ఎస్. అధికారి జి.ఎం. రహీం, 'నేటినిజం' దినపత్రిక సంపాదకులు బైస దేవదాసు, ఆవిష్కర్త డా॥ తెన్నేటి సుధ, అనిశెట్టి రజిత.



ఖమ్మంలో శ్రీమతి యడవల్లి శైలజ రచించిన 'చివురు కోయిల' కవితా సంపుటిని ఏప్రిల్5వ తేదీన ఆవిష్కరిస్తున్న సినీగేయ రచయిత బాస్కరభట్ల రవికుమార్, చిత్రంలో అధ్యక్షత వహించిన ప్రముఖ కవి సాదనాల వేంకట స్వామి నాయుడు, డా॥ బి. మాధురి, పోతగాని, లెనిన్ శ్రీనివాస్ , పారుపల్లి సురేష్, కొత్త శంకరరెడ్డి, కన్నెగంటి, తిరునగరి శ్రీనివాసరావు తదితరులు ఉన్నారు.

### కవితా సంపుటాలకు ఆహ్వానం

పాతూరి మాణిక్యమ్మ స్మారక సాహిత్య అవార్డు కొరకు 2014 సంవత్సరంలో ప్రచురింపబడిన తెలుగు వచన కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్లు పాతూరి అన్నపూర్ణ ఒక ప్రకటనలో తెలిపారు. ఉత్తమ కవితాసంపుటికి రూ.5,000/- నగదు బహుతి అందించనున్నట్లు తెలిపారు. జూన్ 30 లోపుగా మూడు కవితా సంపుటాలను 'పాతూరి అన్నపూర్ణ, 1156/28-1, ప్రశాంతినగర్, నవలాకుల గార్డెన్స్, నెల్లూరు-2' చిరునామాకు పంపవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9490230939, 9949237534 నంబర్లకు సంప్రదించవచ్చును.

# 'శ్రీధర్ గజళ్ళు' పుస్తకావిష్కరణ

కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో మే 3 న గజల్ రచయిత పాలపర్తి శ్రీధర్ వ్రాసిన 'శ్రీధర్ గజళ్ళు' పుస్తకావిష్కరణ సభ జరిగింది. ప్రముఖ కవి డా॥ అద్దేపల్లి పుస్తకాన్ని ఆవిష్కరిస్తూ శ్రీధర్‌లో గజల్ రచనాప్రేరణ నిరంతరంగా ఉందని, కుటుంబ ప్రేమల్ని గజలీకరించడంలో అసామాన్య ప్రతిభగలవారనీ చెప్పారు. మాకినీడి సూర్యభాస్కర్ ఈ పుస్తకం ఒక గజల్ శతకమని, వంద గజళ్ళు ఒకే సంఖ్య గల మాత్రాగణాలతో రాయడం కష్టసాధ్యమైన విషయమని, చందోవివరణ చేసారు. శ్రీధర్ భావాలలోని సౌకుమార్యాన్ని, పదప్రయోగంలోని సారళ్యాన్ని ప్రశంసించారు. శ్రీధర్ వ్రాసిన రెండు గజళ్ళను మేడిశెట్టి శ్రీరాములు పాడిన విధానం శ్రోతల్ని ఆనందింపజేసింది. శ్రీధర్ తన స్పందన తెలుపుతూ, తాను గజళ్ళలో రాసిన ప్రతీ సంఘటన తన జీవితానుభవమే అనీ, ప్రతిరోజు గజల్ రాస్తానని, యిప్పటికి 1500 గజళ్ళు రాసానని చెప్పారు. ఉయ్యపు హనుమంతరావుగారు శ్రీధర్‌ను సత్కరించారు.



కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో మే3న జరిగిన పాలపర్తి శ్రీధర్ రచన 'శ్రీధర్ గజళ్ళు' ఆవిష్కరణ సభ. చిత్రంలో ఉయ్యపు హనుమంతరావు, గనారా, పాలపర్తి శ్రీధర్, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, మాకినీడి సూర్యభాస్కర్, మేడిశెట్టి శ్రీరాములు

తర్వాత 'ఊహలు' అంశముపై జరిగిన కవితాగోష్ఠిలో గరికిపాటి మాస్టారు, ఇందిర, మణిబాబు, ఉయ్యపు హనుమంతరావు, మద్దాలి సత్యనారాయణ, శిరీష, గడల శివప్రసాద్, విశ్వనాధమ్, నోరి బలరాంమూర్తి మొదలైన వారు పాల్గొన్నారు. గ.నా.రా వందన సమర్పనతో సభ ముగిసింది.



హైదరాబాద్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్ హాల్‌లో 'కలహంస' పురస్కారాన్ని తంగిరాల చక్రవర్తికి ప్రదానం చేస్తున్న ప్రముఖ సినీ నటుడు తనికెళ్ళ భరణి, కవి, సినీ గేయ రచయిత గోరటి వెంకన్న, నెమలీక - నెలవంక పత్రిక సంపాదకులు ఎల్. శ్రీదేవి, యక్కలూరి శ్రీరాములు



మహబూబ్‌నగర్ జిల్లా అధికార భాషా సంఘం, జిల్లా సాంస్కృతిక మండలి సౌజన్యంతో ఏప్రిల 26న జిల్లా కేంద్రంలోని రెవెన్యూ సమావేశ మందిరంలో తెలంగాణ సాహిత్య పరిశోధన కేంద్రం,పాలమూరు సాహిత్య పరిశోధన కేంద్రం సంయుక్త ఆధ్వర్యంలో జరిగిన పాలమూరు సాహిత్య సదస్సు. చిత్రంలో అడిషనల్ జాయింట్ కలెక్టర్ డాక్టర్ రాజారాం, మాజీ డిసిసిబి చైర్మన్ బుర్రి వెంకట్రామిరెడ్డి , తెలంగాణ సాహిత్య పరిశోధన కేంద్రం అధ్యక్షులు ఆచార్య ఎస్వీరామారావు ఆచార్య కసిరెడ్డి పాలమూరు, వైద్యం వెంకటేశ్వరాచార్యులు, పల్లెర్ల రామ్మోహన్‌రావు, సంబరాజు రవిప్రకాష్‌రావు, డా॥భీంపల్లి శ్రీకాంత్ తదితరులు. ఈ సందర్భంగా డాక్టర్ వి.భాస్కరయోగి రచించిన స్వామి వివేకానంద ఏకపాత్రాభినయం పుస్తకాన్ని ఎజెసి రాజారాం ఆవిష్కరించారు.

# సుధామకు డా॥ పింగళి జగన్నాథరావు స్మారక పురస్కారం



ప్రముఖ సాహిత్యవేత్త సుధామకు డా॥ పింగళి జగన్నాథరావు స్మారక పురస్కారం అందివ్వనున్నట్లు గుదిబండి వెంకటరెడ్డి, పొత్తూరి సుబ్బారావు ఒక సంయుక్త ప్రకటనలో తెలిపారు. ఆకాశవాణి కార్యక్రమ నిర్వహణాధికారిగా 2008లో పదవీ విరమణ చేసిన సుధామ ప్రస్తుతం యువభారతి ప్రచురణల ప్రధాన సంపాదకులుగా ఉన్నారు. మేం, అగ్నిసుధ, చిత్రగంధి కవితా సంపుటాలు, మనసు పావనగంగ (పాటలు), కవికాలమ్ (ఆంధ్రప్రభ కవితాత్మకకాలమ్), పూతరేకులు (జోక్స్ సంపుటి) తదితర పుస్తకాలు వెలువరించారు. జూన్ 8న హైదరాబాద్‌లో త్యాగరాయగానసభలో నిర్వహించే కార్యక్రమంలో ఈ పురస్కారాన్ని అందజేయనున్నట్లు ఆ ప్రకటనలో తెలిపారు.




కర్నూలు సాహితీస్రవంతి ఆధ్వర్యంలో మే 17న జరిగిన ప్రముఖ కథారచయిత పాలగుమ్మి పద్మరాజు శతజయంతి సభలో ప్రసంగిస్తున్న పాలగుమ్మి సీత. చిత్రంలో వేదగిరి రాంబాబు, సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, శాంతినారాయణ, కొంపెల్ల శర్మ తదితరులు.




కాకినాడ సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో జరిగిన మద్దా సత్యనారాయణ రచన 'జ్ఞాన చంద్రిక' ఆవిష్కరణ సభ. చిత్రంలో అద్దేపల్లి రామమోహనరావు, గనారా, జోస్యుల కృష్ణబాబు, ఫకీర్రావు తదితరులు.



ప్రముఖ కవి, కథా రచయిత సతీష్ చందర్‌కి డాక్టర్ పరుచూరి రాజారామ్ సాహితీ పురస్కారాన్ని అందిస్తున్న పి.వి. సునీల్ కుమార్ ఐపిఎస్ అరసం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వల్లూరు శివప్రసాద్, పరుచూరి రజిత, వైదికపై అరసం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీ నారాయణ, డా॥ పాపినేని శివశంకర్, అరసం జిల్లా ప్రధాన కార్యదర్శి చెరుకుమల్లి సింగా, ఎ.ఎం.ఆర్. ఆనంద్‌లు.



హైదరాబాద్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్‌లో సాహితీ మేఖల ఆధ్వర్యంలో మే 18న "దాశరథి అగ్నిధార" సాహితీ కార్యక్రమంలో పున్న అంజయ్య రాసిన "నల్గొండ జిల్లా శతక కవులు – ఒక పరిశీలన" గ్రంథాన్ని ఆవిష్కరించిన జ్ఞాన పీఠ పురస్కార గ్రహీత డా॥ సి. నారాయణ రెడ్డి. చిత్రంలో డా॥ తిరునగరి, డా॥ ఎన్ గోపి, పున్న అంజయ్య, డా॥ పోరెడ్డి రంగయ్య, 'నేటినిజం' పత్రిక సంపాదకులు బైస దేవదాసు, ఆచార్య ఎస్వీ రామారావు, యెల్ది సుదర్శన్

## కవితల పోటీ

కళల దండోరా మాస పత్రిక 2వ వార్షికోత్సవం సందర్భంగా కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు ఆ పత్రిక సంపాదకులు అంగలకుర్తి ప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. ప్రథమ బహుమతి రూ 5,000/–, ద్వితీయ బహుమతి రూ. 3,000/–, తృతీయ బహుమతి రూ. 2,000/–, ప్రత్యేక బహుమతి రూ.1,000/– మరో 16 కవితలకు ప్రోత్సాహక బహుమతిగా రూ.500/– అందించనున్నట్లు తెలిపారు. జూలైలో జరిగే వార్షికోత్స సభలో గెలుపొందిన కవులు కవితాగానం చేయాలని కోరారు. తమ కవితలను "కళల దండోరా" మాసపత్రిక, డోర్ నం.35-03-69/(31/16/ఏ) నంజయ్‌గాంధీ కాలనీ, చిరునామాకి పంపించవలసిందిగా కోరారు. ఇతర వివరాలకు 9492509969 నంబరుకి సంప్రదించగలరు.



గుంటూరు జిల్లా రచయితల సంఘం సహకారంతో శ్రీ బాలభారతి, శ్రీ క్రాంతి కిరణాలు ప్రాజెక్టు ఆధ్వర్యంలో గుంటూరు జిల్లా కేంద్ర గ్రంథాలయంలో మే7న జరిగిన విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ 155వ జయంతి సభ. చిత్రంలో కవి ఎస్.ఎం. సుభాని, బాల భారతి సంఘం కార్యదర్శి అధ్యక్షులు యర్రం సాంబిరెడ్డి, క్రాంతికిరణాలు ప్రాజెక్టు చైర్మన్ కేళంగి వంశీకృష్ణ ఉన్నారు.


Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor: T. Ravi**

31.08.1925 - 04.06.1998




సుప్రసిద్ధ అభ్యుదయ కవి, రచయిత, పరిశోధకుడు, విమర్శకుడు త్వమేవాహంతో తెలుగు కవిత్వంలో కొత్త ప్రయోగశైలి ప్రారంభించారు. అనేక కావ్యాలు, పరిశోధనా గ్రంథాలు రాశారు. సమగ్ర ఆంధ్రసాహిత్యం 13 [illegible]

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15
Date of Positng : 30.05.2015 . Date of Publication: 27.05.2015

PRSVMOZA160

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు




వెల:రూ.50/-




వెల:రూ.150/-




వెల:రూ.150/-




వెల:రూ.25/-




వెల:రూ.30/-




వెల:రూ.125/-




వెల:రూ.80/-




వెల:రూ.200/-




వెల:రూ.150/-




వెల:రూ.50/-

## మాక్సీం గోర్కీ సమగ్ర రచనలు






వెల:రూ.200/-




వెల:రూ.270/-




వెల:రూ.120/-




వెల:రూ.200/-




వెల:రూ.60/-




వెల:రూ.200/-




వెల:రూ.70/-




వెల:రూ.125/-

ప్రజాశక్తి బుక్‌హౌస్, ప్లాట్. నెం. 21/1, ఎం.హెచ్.భవన్, ఆజామాబాద్ హైదరాబాద్ - 20. ఫోన్ : 27608107, 9490099202, 9490618942



If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,
Near RTC Kalyana mandapam, Azamabad, Hyderabad - 500 020. Ph: 040- 27660013, Cell: 9490099059

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A160 |
| పుస్తకం పేరు | చేస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | fas |
| వెనుక అట్ట | fas |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KPRAVEEN |
| పేజీలు విడదీసినది | KPRAVEEN |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |